# గోదా గ్రంథమాల

## శాస్త్రవాఙ్మయము : ప్రథమ కుసుమము

ప్రకాశకులు :

శ్రీ గోదా గ్రంథమాల

శ్రీమన్నారాయణపురము

ఉల్లిపాలెం పోష్టు, దివి తాలూకా - కృష్ణా

లభించువారు :

శ్రీమదిత్యాది శ్రీమాన్

ఉ. వే. కాండూరి వేంకట తాతాచార్యులు అయ్యవార్లంగారు

ప్రవాళవర్ణస్వామి కోవెలవద్ద

పెద్ద కాంచీపురం, చెంగల్పట్టు జిల్లా.

# గుర్వన్తరాశ్రయణాది
# దుర్జ్ఞయ నిర్మూలనము

రచయిత:
శ్రీమదిత్యాది శ్రీమాన్
అ. తి. కాం. వేం. తాతాచార్యస్వామివారు
కాలాండార్ వీధి, పెద్దకాంచీపురము



గోదా గ్రంథమాల
శ్రీమన్నారాయణపురము.

గో దా గ్రం థ మా ల
శాస్త్రవాఙ్మయ ప్రథమ కుసుమము
వికారి-దక్షిణాయనము- 1959.

ప్ర కా శ కు లు:
శ్రీ గోదాగ్రంథమాల,
శ్రీమన్నారాయణపురము,
ఉల్లిపాలెం పోస్టు — దివి తాలూకా — కృష్ణా జిల్లా.



వలయువారు :
శ్రీమదిత్యాది శ్రీమాన్
అ. తి. కాం. వేం. తాతాచార్యులు
అయ్యవార్లంగారు,
ప్రవాళవర్ణస్వామి కోవెలవద్ద,
పెద్దకాంచీపురము, చెంగల్పట్టు జిల్లా.

# మనవి

నేటి కాలమున సత్కర్మానుష్ఠానములు మిక్కిలి క్షీణించి పోవుచున్నవి. అందుచే జనులను భక్తిమార్గమునకు త్రిప్పు ప్రయత్నము విరివిగా చేయవలసియున్నది. భగవంతునిపై భక్తి నిలుచుటకు సద్గురువు నాశ్రయించవలెను. అట్టి ప్రయత్నమే యీ గ్రంథమున గావింపబడినది.

ఈ గ్రంథము మేము ప్రారంభించిన శాస్త్రవాఙ్మయమున ప్రథమ కుసుమముగా ప్రకాశింపచేసికొనుట కంగీకరించిన శ్రీమాన్ అ. తి. కాం. వేంకట తాతాచార్యస్వామివారికి మిగుల కృతజ్ఞులము.

ఈ గ్రంథముద్రణకు వలయు ద్రవ్యమంతయు విరాళముగ నొసగిన శ్రీమతి కాండూరి లక్ష్మీనరసమ్మగారికి మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు,

గోదా గ్రంథమాల.

# తొలి పలుకు

భక్తి జ్ఞాన ప్రపత్తులు సడలుచున్న ఈకాలమందు తదుద్బోధమునకై యిటువంటి వ్యాసరాజము లెన్నేని యవసరము. సద్గురువన నెవరో, వారిని ఎట్లాశ్రయింపవలెనో మొదలగు విషయములను సవిస్తరముగా వ్రాసిన శ్రీమాన్ అ. తి. కాండూరి వేంకట తాతాచార్యస్వామివా రెంతయు నభివంద్యులు.

భాగవత దాసుడు.

న. చ. కృష్ణమాచార్యుడు.



ఉ. వే. ప్ర. అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్ వంశస్థులు
శ్రీమాన్ అ తి. కాండూరి వేంకట తాతాచార్యులు అయ్యవార్లంగారు

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమ ద్దయాపాలమునయే నమః
శ్రీమ ద్రంగగురవే నమః

# గుర్వంతర్యాశ్రయణాది
# దుర్నయ నిర్మూలనము

శ్లో॥ నమ స్తురంగవదన మజ్ఞానధ్వాన్తభాస్కరం।
శుద్ధస్ఫటికసంకాశ మాశ్రితస్వర్ద్రుమం హరిం॥

శ్లో॥ శ్రీమ ద్దయాపాలమునీన్ద్రవంశ్యం
వారాశికన్యానయనాన్తరఙ్గం
విద్యాతరంగం యశసా చ తుఙ్గం
రంగార్య మీడే విహితార్యసఙ్గం॥

శ్రియఃపతియును, శ్రీవైకుంఠనికేతనుడును, నిత్యముక్తానుభావ్యుండును, నిరతిశయానందయుక్తుండును, సకలజగజ్జనోజ్జీవనైకతత్పరుండును నగు సర్వేశ్వరుండీ కలియందు పాపభూయిష్ఠమైన యాత్మకోటియొక్క దుఃఖపరంపరలను జూచి వీరల నుజ్జీవింపజేయుట కుపాయమును యోచించి- శ్లో॥ శేషాంశం ధామ మామకం॥ అనినట్లు స్వాంశభూతులైన యనంతులను సంబోధించి- యనాదివాసనాదూషితాశేష శేముషీకులగు నా ఆత్మకోటి నుజ్జీవింపజేయ మీచేత నీయబడిన విభూతిద్వయమును పరిగ్రహించి ఈ భూఖండమునం దత్యంతశ్రేష్ఠమగు నార్యావర్తమున భగవ ద్రామానుజులుగ నవతరించి చేతనకోటి నుజ్జీవింపజేయుడని నియమింప, వా రవతరించి యాత్మకోటిని దమ సంబన్ధముచే నుజ్జీవింపజేసి, తమ యనంతరమునంగూడ నా ఆత్మకోటి నుజ్జీవింపజేయుటకై తమ శిష్యులలో ముఖ్యులగు 74 డెబ్బదినలువు

రను పరంపరాచార్యత్వమున కభిషిక్తులనుగ జేసి రను సంగతి యందరికిని విశదమేగదా! ఇట్టి పరిస్థితిలో కొందరు కల్యావేశిత రాజస తామస బుద్ధులచేధర్మాధర్మవిచక్షణాశూన్యులై నిర్దిష్ట పరంపరాచార్యులను త్యజించి,యజ్ఞానజన భ్రామకాడంబరములకు భ్రమసి, సన్న్యాసులు మొదలగువారి నాశ్రయించుచున్నారు. ఆచార్యులనగ సమాశ్రయణప్రదులు, వారి పుత్రభ్రాతృ జ్ఞాత్యాదులు నని యర్థము. అన్యుల నట్లాశ్రయించుటకు శాస్త్రములును, పూర్వాచార్యశ్రీసూక్తులును సమ్మతింపవు.

శ్లో॥ య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిం ॥

ఏమనుష్యుడు శ్రుతి స్మృతి విహితంబగు నాయాజ్ఞను విడచి స్వేచ్ఛానుగుణముగ కర్మలను జేయునో వాడు క్రియాసిద్ధినిగాని, సుఖమునుగాని, ఉత్కృష్టమగు గతినిగాని పొందనేరడు.

శ్లో॥ తస్మా చ్ఛాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥

శాస్త్రరూప శాసనముచే జెప్పబడిన కర్మను జేయుటకే అర్హుడవు.

శ్లో॥ యయా ధర్మ మధర్మం చ కార్యం చాఽకార్య మేవ చ ।
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ ॥

ఏబుద్ధిచే ధర్మాధర్మములను, కార్యాకార్యములను అయథార్థముగ తెలుసుకొనునో యా బుద్ధి రాజస బుద్ధి యగును.

శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ ॥

ఏబుద్ధి తమోగుణముచే నావరించబడినదై ధర్మము నధర్మమునుగాను, సర్వవిషయములను విపరీతములుగాను తెలుసుకొనుచున్నదో యా బుద్ధి తామసబుద్ధియని గ్రహింపవలయును.

అని ఇట్లు గీతాచార్యులవారు ప్రసాదించియున్ననూ తామస, రాజస బుద్ధులగువారు శాస్త్రతాత్పర్యములను, లవలేశమైనను, తెలుసుకొనలేక కించిద్జ్ఞులై కృత్యాకృత్యజ్ఞానశూన్యులై, సాక్షాద్ధర్మమగు కులాచార్యుల సేవను పరిత్యజించి అధర్మముగా నితరుల నాశ్రయించి నిరయమునకు పాత్రు లగుచున్నారు. అయితే జ్ఞానహీనుడగు గురువు నాశ్రయింపగూడదని యున్నదే యనిన:

శ్లో॥ ఛిన్ననావాశ్రయో మూఢో యథా పారం నగచ్ఛతి ।
జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్ష మవాప్నుయాత్॥

అనగా: చిల్లిపడవ నెక్కినవా డె ట్లొడ్డును జేరలేడో అట్లే జ్ఞానహీనుడగు గురువు నాశ్రయించినవాడు సద్గతి నొందజాలడు—

ఆపస్తంబ ధర్మసూత్రమున :—
'న పతిత మాచార్యం జ్ఞాతిం వా దర్శనార్థో గచ్ఛేత్॥'

అనగా: పతితాచార్యులను, పతితజ్ఞాతిని దర్శింపగూడదనియున్నది. ఇంకను యిట్టివి యనేకవచనము లున్నవని చెప్పవచ్చును; గాని యా వచనములకు పతితాచార్య త్యాగము నందే తాత్పర్యము, కాని వారి భ్రాత్రాదుల యాశ్రయణ,

నిషేధమునందుగాదు - కులాచార్యు నాశ్రయించుట, శ్లో॥ పితామహం నాథమునిం విలోక్య ॥ యనునట్లు వీరి మూలపురుషులనుబట్టిగదా! కనుక గురు త్యాగవచనములు, ప్రత్యగాచార్యవిషయముగ పరిహరింపవలయును. ఒకవేళను ఆచార్యులు కామక్రోధాభిభూతులై భ్రాతాదుల నాశ్రయింపవలదని ఆజ్ఞాపించిననూ శాస్త్రవిరుద్ధమగుటచే మిక్కిలి పరిహాసాస్పదము. శాస్త్రావిరుద్ధవాక్యములకే ప్రామాణ్యమును జెప్పియున్నది. విరోధములచే జెప్పెడి వాక్యములను యోగ్యులైనవా రొప్పుకొనరు. శాస్త్రవిరుద్ధవాక్యములకు ప్రామాణ్యము నొప్పుకొనినచో సురాపానాదులకును ప్రామాణ్యము నొప్పుకొనవలసివచ్చును. ఇట్లుండగ జ్ఞానియగువాడు ఇతరుల శిష్యులకు సమాశ్రయణమును జేయుడు. 'స్వయం నష్టః పరా న్నాశయతి' యనున ట్లుభయత్ర నరకావహామే గనుక, అట్టివారు గోచర్మపినద్ధవ్యాఘ్రమువలె వేషధారులై మండూకస్వనఫణి సమాన వాక్యములచే మోసపుచ్చువారగుదురు. కనుక, కులాచార్య త్యాగము కేవల నరకావహము. కేవలవేషములు పామరభ్రామకములేగాని పురుషార్థ సాధకములు గానేరవు. పూర్వాచార్య పరిత్యాగము కర్మ ఛండాలత్వమునకు హేతువని శ్రీరామాయణమందలి త్రిశంకు వృత్తాంతమున దెలియును. అది యెట్లనిన: త్రిశంకువను నొకరాజు తన కులగురువగు వసిష్ఠమహర్షిని సశరీర స్వర్గావాప్త్యర్థమై యాగమును జేయింపుమని కోరగా నది యశక్యమని వారు నుడివిరి. అంత నా త్రిశంకువు తన కులాచార్య పుత్రులవద్దకు వెళ్ళి వారి నా యజ్ఞమును చేయింపగోరగా

వారును, ఆ బ్రహ్మర్షి కాదన్నదానిని మే మెట్లు చేయుదుము గలమని యడిగిరి. అందున కా త్రిశంకువు కుపితుడై
శ్లో॥ 'అన్యాం గతిం గమిష్యామి స్వస్తి వోస్తు తపోధనాః ॥
ఓ తపోధనులారా! ఇతరుల నాశ్రయించెదను. మీకు మేలగు గాక యనెను. ఇట్టి ఘోరవాక్యమును విని ఋషిపుత్రులు కుపితులై శపించిరి. తపోధనాః యనెడి బహువచనముచే పుత్రులందరు ఆచార్యకోటి ప్రవిష్టులని యేర్పడుచున్నది.

త్రిశంకు వటుపై విశ్వామిత్రు నాశ్రయించి యజ్ఞమును జేయింపుమని కోరెను. అట్లే కతడు సమ్మతించి యజ్ఞమును చేయించినను స్వర్గావాప్తి కలుగకపోవుటచే నందున, తన తపఃప్రభావముచే స్వర్గమున కంపినను ఆపట నింద్రు డా త్రిశంకువును

శ్లో॥ 'గురూన్ యశ్చావ మన్యేత్ ... మాషకః'
'అవాక్శిరాః ప్రపద్యంతే' ... ణ్యాం నిపాత్యంతే'

అనగా: గురువు నవమానము జేసినవాడును, గురుదూషకుడును, (ఇట్టివారు) తలక్రిందులుగ వైతరణియందు పడవేయబడుదురని యున్నందున

శ్లో॥ 'గురుశాపహతో మూఢ పత భూమి మవాక్శిరాః'

యనగా గురుశాపహతుడవగు నీవు తలక్రిందులుగ భూమియందు పడుమని దక్షిణపుప్రక్కకు త్రోసివేసెను. అందు కా విశ్వామిత్రుడు కుపితుడై తన తపోబలముచే మరియొక స్వర్గమును సృజించుటకు ప్రారంభింపగ దేవతలు వచ్చి—

శ్లో॥ 'అయం రాజా మహాభాగ గురుశాప పరిక్షతః
సశరీరం దివం యాతుం నార్హత్యేవ తపోధన॥'

అనగా గురుశాపహతుడైన యీ రాజు సశరీర స్వర్గ

మున కనర్హుడని పలికిరి. కనుక కులక్రమాగతాచార్యతిర స్కారాదులవలన త్రిశంకువు పొందిన యవాక్శిరస్త్వమును, ఋషిపుత్రులు

శ్లో॥ 'శేపుః పరమ సంక్రుద్ధా శ్చండాలత్వం గమిష్యసి॥'

యని శపించిన ఛండాలత్వమును పొందగలరు— ఈ విషయమునే శ్రీవచనభూషణమునందు:

'త్రిశంకువైపోవ్పేలే కర్మచండాలనాయ్ ప్పూర్విలిట్ట యజ్ఞోపవీతం దానే వారాయ్ విడుం॥'

అని యత్యంత ప్రామాణికులగు పిళ్ళైలోకాచార్యుల వారు ప్రసాదించియున్నారు.

శ్లో॥ 'ఆచార్యో ద్వింపమ ప్రోక్త స్సర్వశాస్త్రార్థవేదిభిః। కులక్రమాగతాచార్య ప్రత్యగ్రాఖ్య స్తథాఽపరః॥'

అనగా: ఆచార్యులు కులాక్రమాగతాచార్యు లనియు, ప్రత్యగ్రాచార్యులనియు రెండు తెగలుగ నున్నా రని శాస్త్రజ్ఞులు జెప్పెదరు.

శ్లో॥ పుంసః పరగతిజ్ఞానే జిజ్ఞాసా జాయతే యది
తత్పూర్వదేశికాభావా ద్యస్సమిత్పాణి రాశ్రయేత్॥
తదానీ మస్య దయయా దీక్షా సంస్కారపూర్వకం।
మన్త్రార్థ వ్యాఖ్యకృ దాచార్యః ప్రత్యగ్రాఖ్య స్స ఉచ్యతే॥

అనగా, ముందాచార్య సమాశ్రయణమే లేనివానికి భక్తిని దెలిసికొనగోర్కె కలిగినచో సమిత్పాణియై యొకరి నాశ్రయింపవలయును. అప్పుడా శిష్యునియందు వాత్సల్య ముచే దీక్షాదుల నొనర్చిన వారిని ప్రత్యగ్రాచార్యులని చెప్పెదరు. వీరే— శ్రు॥'పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో

నిర్వేద మాయాత్' అనెడి శ్రుతికి విషయభూతులు—
కులక్రమాగతులనగా:—

శ్లో॥ ధర్మ ద్వారా కర్మ యస్మిన్ జాతి స్తత్కుల ముచ్యతే।
తత్రప్రవాహతశ్చాపి పదవిక్షేపణం క్రమః॥

శ్లో॥ 'అగత స్తత్వబోధాయ విభు రాచార్యమూర్తిమాన్ ।
కులక్రమాగతాచార్యం త మాచార్యవిదో విదుః'॥

ధర్మద్వారమున కర్మానుష్ఠానముగలదియే జాతి యని యును, కులమనియును చెప్పబడును. ప్రవాహన్యాయముచే ఆకులమున వర్తించుటయే క్రమశబ్దార్థము. ఆచార్యరూపమును దాల్చి తత్త్వోపదేశము జేసి తరింపజేయుదలచి అవతరించిన భగవంతుడే యాగతశబ్దార్థము. ఆచార్య లక్షణ తెలిసినవారీ యాచార్యులను కులక్రమాగతాచార్యు తెలుసుకొనుచుందురు.

శ్లో॥ 'ప్రత్యగ్రాఖ్య స్తథా పరః' యను శ్లో యథా యని ధర్మనిర్దేశముచే ప్రత్యగ్రాచార్యు ద ప్రాధాన్యము సూచితమాయెను.

శ్లో॥ 'కులాచార్యస్య భజనం యే వా సుకృతినో జనాః
కుర్వన్తి సతతం భక్త్యా తే వన్ద్యా స్సర్వదైవతైః॥'

అనగా యెల్లప్పుడును కులాచార్యానువర్తనపరు పుణ్యాత్ములు దేవతలందరకును వందనీయులని, కన్న కులాచార్యుల మహిమను తెలియపగ...—

శ్లో॥ య త్కృత్వా షోడశ మహాదానాని లభతే ఫలం
తత్ఫలం సమవాప్నోతి కులాచార్యస్య పూజనాత్॥

అనగా షోడశమహాదానములను చేయుటచే ఫా

ఫలమును కులాచార్య భజనము వలన పొందుదురని కులాచార్య పూజాఫలమును చెప్పిరి.

శ్లో॥ సంతుష్టేతు కులాచార్యే శ్రద్ధయా యస్య భక్తితః।
తేన తుష్టం జగత్సర్వం తుష్టా స్స్యుస్సర్వదేవతాః॥'

అనగా: శిష్యునియొక్క శ్రద్ధాభక్తులచే కులాచార్యులు సంతోషించినయెడల సర్వజగత్తును, సర్వదేవతలును సంతోషించెదరు.

శ్లో॥ సార్ధత్రికోటి తీర్థేషు స్నాత్వా యత్ఫల మాప్నుయాత్।
తత్ఫలం సమవాప్నోతి కులాచార్యస్య పూజనాత్॥'

అనగా సార్ధత్రికోటి తీర్థములయందు స్నానము చేసిన ఫలమును కులాచార్యపూజచే పొందెదరు అనియు నిట్లు ప్రత్యగ్రులకన్నను కులాచార్యులయొక్క ఆధిక్యతను ప్రతిపాదించిరి.

శ్లో॥ 'దైవా ద్దేశాన్తరగతే ఉప్తే వా కులదేశికే।
తదీయ పుత్ర భ్రాత్రాదే రుపదేశోపి గృహ్యతాం॥'

అనగా కులాచార్యులు దేశాన్తరగతులైనను, పరమపదించిననూ వారిపుత్ర భ్రాత్రాదులను,జ్ఞాతులను ఆశ్రయించి వారివలన నుపదేశమును జెందవలయును.

శ్లో॥ తత్పుత్రాదే రభావేతు శిష్యశ్చేత్తత్వలోలుపః।
[illegible]భావం సర్వజ్ఞ మాచార్యాన్తర మాశ్రయేత్॥

భక్తిని దెలి[illegible], వారి పుత్ర భ్రాత్రాదులుగాని,జ్ఞాతునాశ్రయింపవలయ లేనియెడల తత్వార్థియగు శిష్యుడు స్వాచాముచే శ్రీరా ఆభిజాత్యవిశిష్టులై జ్ఞానాధికులగు నితరుల నాశ్రయింపవలెను.

శ్లో 'దైవాధీనా త్కులాచార్యే తత్పుత్రాదౌ తథాగతే।
ఉపదేశో గృహీతవ్యః పునః కులగురోర్మనోః॥
పునస్సంస్కార సంశుద్ధా స్స్వర్ణవ ద్గత కల్మషాః
వంశపూతా వివర్ధంతే రాజన్తే శిష్యకోటయః॥'

అనగా: ఇతరుల నాశ్రయించిన వెనుక కులాచార్యులుగాని, వారి పుత్రులు మొదలగు వారుగాని దైవాధీనముచే వచ్చినయెడల తిరుగ కులాచార్యులవలన మంత్రోపదేశము పొందవలయును. అట్లు చేసిన ఆ పునస్సంస్కారము వలన పరిశుద్ధులై, స్వర్ణమువలె గతకల్మషులై - వంశాభివృద్ధిని పొంది ప్రకాశింతురని చెప్పబడెను. అట్లు చేయనిచో విపరీత ఫలమును పొందుదు రనుటలో తప్పేమున్నది. మరియు,

శ్లో॥ కులక్రమాగతాచార్య సన్నిధా వన్యదేశికః।
అనుమత్యా వినా తస్య సంపూజ్యో న కదాచన॥

అనగా: కులక్రమాగతాచార్యానుమతివినాగా ప్రత్యగాచార్యులను ఎప్పుడునూ పూజింపరాదని భావము. ఈ శ్లోకమునకు వ్యాఖ్యానము శ్రీవచనభూషణమీమాంసాగ్రన్థమునందు 'ఆచార్యాన్తరత్తిల్ పంచసంస్కారం తుడంగియాయిరుందదాకిల్ మీళవుం పంచసంస్కారంగళైయుం కులాచార్య విడత్తిల్ ప్రార్థిత్తు పెత్తుక్కొండు తాఙ్గళ్ పణ్ణిన వపరాధత్తుక్కు-క్షామణం పణ్ణిక్కొండు, శుద్ధరాయ్, అన్దపరాధ క్షాపణత్తాల్ ప్రసన్ననాన కులాచార్యనుడైయ అభిమాన విశేషత్తాల్ పరిశుద్ధమాన వంశత్తై యుడైయరాయ్. అవర్కళ్ వృద్ధియాకిర యోగత్తైయుం దీప్తియాకిర క్షేమత్తైయుం ఉడైయవర్గళితే' - అని వ్రాయబడియున్నది. మన

ప్రవృత్తి నివృత్తులకు శాస్త్రమే ప్రమాణమని యాస్తికాగ్రే సరులందరును జెప్పియున్నారు.

శ్లో॥ 'తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥

అనగా నీవు చేయు కార్యాకార్యములకు శాస్త్రమే ప్రమాణముగనుక శాస్త్రమందు జెప్పబడిన విధానమును దెలిసికొని యాచరింపుమని భావము. మరియును సర్వేశ్వరుడు బ్రహ్మనుగురించి-

శ్లో॥ బహునాత్ర కి ముక్తేన బ్రహ్మన్ సంక్షేపతః శృణు ।
నవేదై ర్నాగమై శ్శాస్త్రై ర్నపురాణై స్సువిస్తరైః
న యజ్ఞై ర్న తపోభిర్వా న తీర్థై ర్వ్రతకోటిభిః
నాన్యై రుపాయై ర్వివిధైః మన్త్రౌషధ పురస్సరైః
కులక్రమాగతాచార్య తిరస్కారజ పాతకాత్
ముచ్యతే మనుజో మూఢ స్సర్వదుర్గతి భాజనః॥

ఓ బ్రహ్మా! సంక్షేపముగ జెప్పుచున్నాను; వినుము. వేదాభ్యాసముచేతను, ఆగమాభ్యాసముచేతను, శాస్త్రాభ్యాసముచేతను, పురాణాది పఠనముచేతను, యజ్ఞములచేతను, తపస్సుచేతను, తీర్థయాత్రలచేతను, కోటివ్రతములచేతను, మంత్రౌషధ పురస్సరములగు ఇతరోపాయములచేతను కులక్రమాగతాచార్యతిరస్కారముచే కలిగెడి పాతకము వలన విముక్తుడు కానేరడు. (కింతు) అట్టి మూఢుడు సర్వదుర్గతులకు పాత్రుడు కాగలడని యర్థము. మరియు,

శ్లో॥ రుష్టే కులగురౌ తస్మిన్ త్రాతా నైవాస్య కశ్చన।
సర్వదేవేషు రుష్టేషు త్రాతాసౌ కులదేశికః॥

సర్వులు కోపించినను కులాచార్యులు రక్షకులు కాగ

లరు. కులక్రమాచార్యులు కోపగించిన నెవనును రక్షింప జాలరు- యని యర్థము.

శ్లో॥ 'తస్మా త్సర్వాత్మనా బ్రహ్మన్ కులాచార్యం ప్రపూజయేత్,
కర్మణా మనసా వాచా నిర్దోష శ్శుద్ధి మాప్నుయాత్॥'

కనుక సర్వప్రకారములచేతను కులాచార్యులనే పూజింపవలయును. అట్టివాడు త్రికరణములచేతను నిర్దోషియై శుద్ధిని పొందగలడు. అని అర్థము. తిరుప్పావున 'కర్ట్రుక్క- రవై' యనుపాశురమున మువ్వాయిరప్పడి చిన్నఅరుంబద మున:

"ఆచార్య సంతానప్రసూతర్గళ్ నమక్కు- పూజ్యర్; అవర్గళడియాక భగవ త్సమాశ్రయణం పణ్ణుకైయే స్వరూపం" అని ప్రసాదించినారు. శ్రీవచనభూషణమున, 'భగవ దపచారా పేక్షయా భాగవతాపచారముం, తద పేక్షయా తద్భక్తాపచారం, తదపేక్షయా ఆచార్యాపచా రం, తదపేక్షయా తద్భక్తాపచారముం ఒన్రు క్కొన్రు విష యగౌరవత్తాలే వ్యాఘ్ర గో బ్రాహ్మణ హింసాదిగళుక్కు- క్రౌర్యతారతమ్యం శొల్లుకిఱాప్పోలే అతిక్రూరం' అనిచెప్పి యున్నది. మరియు

శ్లో॥ 'గురూంశ్చ యేవమన్యంతే వాక్రూ-రై స్తర్జయన్తి యే।
సర్వే తే నరకే ఘోరే పాత్యంతే పాపకర్మణః॥'

అనగా- ఆచార్యులను అవమానము జేయువారు, క్రూరవాక్యములచే బెదరించువారు ఘోరమగు నరకమున పడవేయబడుదురని చెప్పబడియున్నది— 'గురూన్' అని బహువచనమువలన ఆచార్య కులస్థులందరికి గ్రహణమే.

శ్లో ॥ లోకే కులగురోరాజ్ఞాం వినా యోఽన్యం గురుం వ్రజేత్ ।
సయాతి నరకం కర్మఖండాలత్వం నిరంతరం॥

అనగా లోకమునందు కులగురువుల యాజ్ఞ లేనిది యితరుల నాశ్రయించినయెడలను అట్టివా డన్ని విధములను యెల్లప్పుడును కర్మఛండాలు డగునని దీని భావము.

శ్లో॥ అథాన్యత్ర గురు ర్గచ్ఛే త్తత్పుత్రాదిక మాప్నుయాత్ ।
తస్మిన్నపి గతేఽన్యత్ర తద్బంధూ నయ మాప్నుయాత్॥

అనగా, ఆచార్యులు దేశాంతరగతులైనయెడల వారి పుత్రులు మొదలుగా గలవారిని, వారును లేనియెడల వారి బంధువులను ఆశ్రయించవలయుననియు,

శ్లో ॥ అసత్సుతేషు విద్వాంసం జ్ఞానినం సమదర్శినం ।
అన్యం కంచి ద్గురుం గచ్ఛే ద్వినీతో భక్తిమాఞ్ఛుచిః॥

అనగా వారిబంధువులును లేనియెడల విద్వాంసుడును జ్ఞానియును సమదర్శియును అగు వేరొక గురువును, వినయమును భక్తియును పరిశుద్ధియు గలవాడై యాశ్రయించవలయుననియు వివరింపబడియున్నది. ఇట్లున్నందువలనను సన్యాసులు మొదలగువారిని ఆశ్రయించునట్లు చెప్పనందునను, యితరాశ్రయణ మశాస్త్రీయ మని వేరుగా జెప్పనక్కర లేదుగదా. మరియు,

శ్లో॥ ఆచార్యం కలశోదైస్తు పరయే దభిషేచితం ।
తద్వంశసంభవం వాపి పారంపర్యక్రమాగతం ॥
అన్యథా సకలం కర్మ యథా శూద్రకృతం భవేత్ ॥

కలశోదకములచే పట్టాభిషిక్తులగు వారినిగాని, వారి వంశస్థులైయుండి పరంపరాప్రాప్తమైన యాచార్యత్వముగల

వారినిగాని యాచార్యులుగా వరించి వారివలననే పంచసంస్కారాదులను లభించవలయును. ఇట్లుగాక ఇతరుల నాశ్రయించిన శూద్రకృతమగు కర్మమంటిది యగును.
శ్రీమద్రామాయణమున :-

శ్లో॥ ఋషిపుత్రాస్తు తచ్ఛ్రుత్వా వాక్యం ఘోరాభిసంహితం ।
శేపుః పరమసంక్రుద్ధా శ్ఛండాలత్వం గమిష్యసి ॥

అనగా త్రిశంకువుచే పలుకబడిన గుర్వన్తరాశ్రయణ రూప ఘోరవాక్యమును ఋషిపుత్రులు విని మిక్కిలి క్రోధ యుక్తులై నీవు ఛండాలత్వమును పొందగలవని శపించిరి. 'అన్యాం గతిం గమిష్యామి' యనెడివాక్యమే ఛండాలత్వము నకు హేతువైన నిక ఆశ్రయణ మెంతపాతకహేతువగునో యోచింపదగును.

శ్లో॥ అన్యత్ర శ్రవణయా దేయ మనుజ్ఞాప్యైవ గచ్ఛతి॥

ఆచార్యు లనుజ్ఞయిచ్చి వెళ్ళినచో ఇతరత్ర గ్రంథ ముల నధికరింపదగును. అనుమతివినా యితరత్ర గ్రంథాది కమును అధికరించగూడదని దీని తాత్పర్యము.
ఉత్తరరామాయణే పంచదశాధ్యాయే :-

శ్లో॥ మాతరం పితరం యోహి ఆచార్యం చావమన్యతే।
స పశ్యతి ఫలం తస్య ప్రేతరాజవశంగతః॥
స పశ్చాత్తప్యతే మూఢో మృతో గత్వాత్మనోగతిం॥

ఆచార్యులను, తల్లిని, తండ్రిని అవమానమును చేయు వాడు యమవశమును పొంది దానియొక్క ఫలమును చూడ గలడు. తరువాత వాడు మృతుడై తనయొక్క కర్మగతిని పొంది తపించును. అని చెప్పియున్నది.

ఉపదేశ రత్నమాల యను గ్రంథమున-

పా॥ జ్ఞాన మనుట్టాన మివై నన్టాకివే యుడై యనాన యను పాశురమున- ఆన, కులక్రమాగతనాన- కురువై -ఆచార్యనై అనియు. [తన్ గురువిన్ తాళ్ణైగళ్] అనుచోట [తన్నుడైయ, కులక్రమాగతనాన గురువినుడైయ-అనియును అర్థమని శ్రీపెరుంబూదూర్ ఎంబార్ జీయర్ స్వామి యానతిచ్చినట్లు పెద్దలవలన వినుచున్నాము. శ్రీ వచనభూషణ వ్యాఖ్యా సమానార్థక మగుటంబట్టియును, ఏకకర్తృకత మగుటంబట్టియును, పూర్వోక్త వచన బలములంబట్టియును యీ అర్థమే ఉపపన్నమని యనియెదరు-ఇందుకు విపరీతముగ ప్రవృత్తులకగు ఫలమును జెప్పుచున్నారు—

భీష్ములనుగూర్చి ధర్మరాజుగారి ప్రశ్న. అనుశాసనిక పర్వమున 82 వ అధ్యాయమున-

శ్లో॥ 'మాతా పితౄన్ గురూంశ్చైవ యేఽవమన్యంతి మోహితాః।
తేషాం గతిం మహాబాహో శ్రోతు మిచ్ఛామి తత్వతః॥'

అని. దీనికి భీష్ముని సమాధానము:

శ్లో॥ "మాతా పితృ గురూణాం చ యే నతిష్ఠంతి శాసనే।
క్రిమి కీట పిపీలేషు జాయన్తే స్థావరేషుచ॥
దుర్లభో హి పునస్తేషాం మానుష్యే పునరుద్భవః ॥

అని. అనగా తల్లిదండ్రుల యొక్కయు, గురువుల యొక్కయు, అవమానమును చేసి యెట్టిగతులను పొందుదురో ఆ గతిని వినదలచినాను, దానిని చెప్పుమనికోరగ - వారియొక్క ఆజ్ఞోల్లంఘనాదులచే, క్రిమి కీట పిపీలికాదుల యందును, స్థావరాదులయందును జనించెదరు. అట్టివారికి

తిరుగ మనుష్య జన్మమే దుర్లభము. అని యుధిష్ఠిరులకు భీష్ములవారు సమాధానమును జెప్పిరి— యాజ్ఞవల్క్యః :-

శ్లో॥ గురూణా మప్యధిక్షేపః వేదనిందా సుహృ ద్వధః।
బ్రహ్మహత్యా సమం జ్ఞేయ మధీతస్య వినాశనం॥

గురునింద, వేదనింద, స్నేహితుని వధయు, చదివిన వేదమును మరచుట, ఇవియన్నియూ బ్రహ్మహత్యా సమ పాతకములు. పూర్వోక్త విధి ననుష్ఠింపక, యవిహితా నుష్ఠానము జేసిన గలుగు ఫలమును జెప్పబడి యున్నది.

శ్లో॥ విహిత స్యాననుష్ఠానా న్నిందితస్య చ సేవనాత్।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతన మృచ్ఛతి॥

విహితము ననుష్ఠింపక, అవిహితమును అనుష్ఠించు టచేతను, యింద్రియ నిగ్రహము లేనందువలనను నరుడు పడిపోగలడని ధర్మశాస్త్రము.

శ్లో॥ గురుం హుంకృత్య ధిక్కృత్య విప్రం నిర్జిత్య వాదతః।
స్మశానే జాయతే వృక్షః కంక గృధ్రోపసేవితః॥

ఆచార్యులను బెదరించిననూ, సేవని అధిక్షేపించిననూ స్మశానమున శవభక్షక పక్షి విశేషములు వసించెడి వృక్షమై జనించును.

శ్లో॥ నారాయణోపి వికృతిం యాతి గురోః ప్రచ్యుత స్య దుర్బుద్ధేః।
కమలం జలా దపేతం శోషయతి రవి ర్నతోషయతి॥

కులక్రమాగ తాచార్యత్వాగపూర్వ కేతరాశ్రయణ ముచే - వాత్సల్య - స్వామిత్వ - సౌశీల్య - సౌలభ్య - జ్ఞాన శక్తి - ప్రాప్తిపూర్త్యాది గుణవిశిష్టుండైనను నారాయ

ణుండు, జలమునుండి యెత్తివేసిన పద్మమును - పద్మబాంః వుండెండబెట్టునట్లు రక్షింపజాలడు. మరియును అట్టివారిని దుః తుల నొందించును. అని యిట్లు అన్వయవ్యతిరేకాదులచే గుర్వంతరాశ్రయణముయొక్క దోషమును స్వాచార్యకుటుంః స్థుల నాశ్రయించుటచే గలిగెడి యుత్తమఫలమును స్పష్ట ముగ ప్రతిపాదించనాయెను-జ్ఞానుల నాశ్రయించుట ఉత్త రక హేతువని తలంచినచో నొకరికన్ననొకరు జ్ఞానులు లభించి నపుడెల్ల సమాశ్రయణమును అగుచునే ఉండవలసివచ్చును గనుక అనవస్థ - ఇందుకు శాస్త్రమును గానరాదు. సత్సంప్ర ప త్తికే విరోధము——ఇది కేవలమును అహంకారగర్భము కనుక నరకావహము.

ఎంతవారికైనను అవిద్యాకర్మవాసనారుచులాకర్షింపః మానవు. తమదోషములను తెలుసుకొనక యితరుల దోషముః నెంచువారి కేదోయొకదోష మెట్టివారియందైనను ఎంచుట కవకాశ మేర్పడకుండ నుండదు.

అట్లు పాతకాదులు కనుపించినయెడల వారిని త్యజించ వచ్చునేగాని వారి భ్రాతృపుత్రాదుల నాశ్రయించి యుజ్జీవిం చగూడదా ?

శ్లో॥ తదీయ భ్రాతృ పుత్రాదే రుపదేశోపి గృహ్యతాం।

అనిగదా యున్నది. ఆచార్యులు దురనుష్ఠాన రహి తులైయున్న జాలదా ? ఆచార్యత్వమున కర్హుడు గృహస్థుడే కాని సన్యాసి కానేరడు——

భారతము ఆదిపర్వమున :-

శ్లో॥ అస్య కావ్యస్య కవయో నసమర్థా విశేషణే।
విశేషేణ గృహస్థస్య శేషా స్త్రయ ఇవాశ్రమాః॥

ఇతరాశ్రమములు మూడును గృహస్థాశ్రమము నెట్లతిక్రమించలేవో, అట్లే ఈ భారతాఖ్య కావ్యము నితరకవులతిక్రమించలేరు— అని గృహస్థాశ్రమ శ్రేష్ఠతను జెప్పిరి.

శ్లో॥ సర్వేషామపి చైతేషాం వేద స్మృతివిధానతః।
గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠ స్స త్రీ నేతా న్బిభర్తిహి॥

మూడాశ్రమములయందుండువారిని భరించుటచే గృహస్థుడే శ్రేష్ఠుడు. అట్లు వేదమునను స్మృతియందును విధింపబడియున్నది.

శ్లో॥ యస్మాత్త్రయో ప్యాశ్రమిణో జ్ఞానే నాన్నేన చాన్వహం।
యథా నదీనదాస్సర్వే సాగరేయాన్తి సంస్థితిం।
తథైవాశ్రమిణ స్సర్వే గృహస్థే యాన్తి సంస్థితిం॥

ఇట్లు మనుస్మృతియందు సర్వాశ్రమములును గృహస్థాశ్రమమునే యాశ్రయించుకొని యుండవలసినందున గృహస్థుడే శ్రేష్ఠుడని చెప్పియున్నందున యత్యాశ్రమము ఆధిక్యము నిర్మూలితమైనది. మరియు,

శ్లో॥ యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజన్తవః।
తథా గృహస్థ మాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః॥
గృహస్థేనైవ ధార్యన్తే తస్మాచ్ఛ్రేష్ఠో గృహాశ్రమీ॥

అనగా వాయువు నాశ్రయించి యన్నిజంతువులును ఎట్లు జీవించుచున్నవో యట్లే యన్నియాశ్రమములవారును గృహస్థుని నాశ్రయించి జీవించుచున్నారు. గనుక గృహస్థుడే శ్రేష్ఠుండని భావము, ఇట్లుండగా నింపలకు విపరీతముగ

దలచుట, "బుద్ధి స్సా పార్థ తామసీ" తామసబుద్ధి యనితలం చవలయును.

శ్లో॥ కాషాయ దండమాత్రేణ యతిః పూజ్యో నసంశయః ।

యని వారునూ పూజ్యులేరైనను

శ్లో॥ సహస్రంతు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే ॥

అని యున్నంతమాత్రమున 'న స్త్రీ శూద్రా వేద మధీయాతాం' అనియు

శ్లో॥ స్త్రీ శూద్ర ద్విజ బన్ధూనాం త్రయీ న శ్రుతిగోచరా॥

యనియు నిషేధించి యున్న వేదోపదేశ బ్రహ్మోప దేశముల కెట్లు తల్లికధికారముండదో యట్లే కేవల కర్మ వశ్యులగు సన్యాసులకు సమాశ్రయణాద్యధికారము లుండ నేరవు — అది గృహస్థునికే. ఎట్లనిన:

వరాహే:- శ్లో॥ యదీచ్ఛే ద్భగవత్కర్మ సేవయా భవశాన్తయే।
పూర్వోక్తాచార సంపన్నం యువానం గృహమేధినం ॥

అని యుపక్రమించి - శ్లో॥ 'ఏవమాది గుణోపేత, మాచార్యం వరయే ద్విజం॥'

అని ముగించియున్నది ఇందు సకలగుణ సంపన్ను డగు గృహస్థుని ఆచార్యునిగ వరించి యుజ్జీవించదగునని చెప్పియున్నది —

శ్లో॥ తస్మా త్సర్వప్రయత్నేన గృహస్థం బ్రహ్మవిత్తమం ।
ఆచార్యం కలశోద్ధైస్తు వరయే దభిషేచితం ॥

అందువలన సర్వథా ప్రయత్నము జేసి గృహస్థుడును, బ్రహ్మజ్ఞానియును, ఆచార్యత్వపట్టాభిషిక్తుండును అగువానినే ఆశ్రయించవలయును. ఈ పట్టాభిషేకమనునది ముందు జెప్ప

బడిన 74 గు రాచార్యపీఠస్థులకే యేర్పడియున్నది

వాసిష్ఠసంహితయందు :

శ్లో ॥ 'ఆచార్యం సత్కులే జాతం శ్రుతి స్మృతి విశారదం।
గృహస్థం సుగుణోపేతం జితేంద్రియ మనాకులం ॥

సత్కుల ప్రసూతి, శ్రుతి స్మృతి వైశారద్యము, గార్హస్థ్యము, జితేంద్రియత్వము ఇత్యాదు లాచార్యత్వమున కావశ్యకములని చెప్పబడియున్నది. మరియొక స్మృతియందు:

శ్లో॥ 'హితోపదేశ మభ్యేత్య గృహస్థం దేశికోత్తమం ।
సంప్రార్థ్య పంచసంస్కారాన్ సుహుతేగ్నౌ యథావిధి ॥
తప్తాభ్యాం శంఖ చక్రాభ్యా మంకనం ప్రాప్య శుద్ధధీః ।
అధీత్య మంత్ర మంత్రార్థాన్ సద్గతిం సమవాప్నుయాత్ ।
తస్మాత్తు సుహుతే వహ్నౌ గృహస్థో దేశికోత్తమః ॥
తప్తాభ్యాం శంఖ చక్రాభ్యా మంకయిత్వా సమాహితః
హితోపదేశపూర్వంతు శిష్య మధ్యాపయే న్క్రమం ॥'

అనగా, శిష్యుడు దేశికోత్తముడగు గృహస్థునివద్దకు వెళ్ళి పంచసంస్కారములను ప్రార్థించి యథావిధిగ హోమము చేయబడిన యగ్నియందు తప్తముచేయబడిన శంఖ చక్రములచే అంకనమును లభించి మంత్ర మంత్రార్థములను అధ్యయనమును జేసి సద్గతిని జెందవలయునని భావము. కనుక ఆచార్యుడగు గృహస్థుడు హోమాగ్నియందు తప్తముచేసి శంఖ చక్రములచే అంకనమును జేసి మంత్ర మంత్రార్థములను ప్రసాదించవలయునని యున్నది. ఇచ్చట గృహస్థుడని యున్నది. ఇట్లు పరాశరస్మృత్యుత్తరఖండమున జెప్పబడి యున్నది.

దేవలుండు :-

శ్లో॥ పక్వాన్నం చ గృహస్థాయ తాంబూలం బ్రహ్మచారిణే ।
యతయే కాంచనం దత్వా తద్దాతా నరకం వ్రజేత్ ॥

గృహస్థునకు పక్వాన్నమును, బ్రహ్మచారికి తాంబూలమును, యతికి సువర్ణము నిచ్చినవాడు నరకమునొందును.

యమస్మృతియందును :-

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం యతిభ్యో య త్ప్రయచ్ఛతి ।
న త త్ఫల మవాప్నోతి తత్రైవ పరివర్తతే ॥

స్వర్ణము, వెండి, రాగి యను వాని భిక్షువుల కిచ్చిన దానఫలంబు లేక యచ్చటనే తిరుగుచుండును. కనుక భిక్షుకునకు ద్రవ్యమీయదగదని చెప్పియున్నది.

వృద్ధజాబాలి :-

శ్లో॥ యస్తు దానపరో భిక్షు శ్శిష్యాదీనాం చ సంగ్రహీ ।
ఉభౌ తౌ మందబుద్ధిత్వాత్ పూతీనరక పాతినౌ ॥

శంఖలిఖితుడు :-

శ్లో॥ సువర్ణం రజతం తామ్రం తైజసం యచ్చ కించన ।
స్పృష్ట్వా పరివ్రాట్ శూద్ర స్స్యాత్ సవాసా జల మావిశేత్ ॥

దానపరుడగు యతియును, శిష్యసంగ్రహియగు యతియును మందబుద్ధిగల వీరిరువురును, నరకమున బడుదురు. సువర్ణమును, రజితమును, తామ్రమును, యింక నే తైజస ద్రవ్యమునైనను స్పృశించిన యతి శూద్రుడు కాగలడు. కనుక కట్టువస్త్రములతో స్నానమును జేయవలయును.

వ్యాస స్మృతియందు :-

శ్లో॥ పారివ్రాజ్యం గృహీత్వా తు య స్స్వధర్మే నతిష్ఠతి।
శ్వపాదేనాఙ్కయిత్వా తం రాజా రాష్ట్రా ద్వివాసయేత్ ॥

అనగా సన్యసించి తన ధర్మమున నుండనిచో వానికి రాజు కుక్కపాద చిహ్నముగల ముద్రవేయించి రాజ్యము నుండి వెడలగొట్టవలయుననియు, శ్లో॥ నగరస్తు నగన్తవ్యం। అనగా యతి యగువాడు నగరమునందు ప్రవేశించదగదని యును జెప్పియున్నది

ఈ కాలమున సన్యాసులు ధనార్జననిమిత్తము సర్వత్ర వెళ్లి ధనము నార్జించి జామాత్రాదులకు వినియోగించుటయు, వారిని వెంబడిపెట్టుకొని వెళ్ళుటయును ప్రత్యక్షముగ జూచు చుండియు, వారి నాశ్రయించుటయును విధిచోదితులగు స్వాచార్యులను త్యజించుటయును యింతకన్నను పాతక మేమియు న్నది. కలియందు దోషసంభవమునుబట్టి చతుర్థాశ్రమ నిషేధ మేర్పడియున్నది.

శ్లో॥ అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకం।
దేవరాచ్చ సుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్ ॥

అన్యత్ర :-

శ్లో॥ 'కలౌ న చ కమండలుం' అనియు
సముద్రయాత్రా స్వీకారః కమండలు విధారణం।
ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యా నాహు ర్మనీషిణః ॥

అనియు నిషేధించిరి. సన్న్యాసమునకు కలియందు వ్యాసులవా రొక వ్యవస్థను జేసియున్నారు.

శ్లో॥ చత్వార్యబ్ది సహస్రాణి చత్వార్యబ్దిశతానిచ ।
కలౌ యదా గమిష్యన్తి తదా త్రేతా పరిగ్రహః ॥
సన్యాసశ్చ నకర్తవ్యో బ్రాహ్మణేన విజానతా॥

అనగా కలియుగమున (4400) సంవత్సరము లవరకు సన్యాసాశ్రమమును పరిగ్రహించవచ్చునని యిందువిషయమై విశేష విధిగ జెప్పియున్నారు. అటుపై నిషేధించి యున్నది–గనుక సన్యాసమే అశాస్త్రీయము. రామానుజులవారు యిట్టి కలి నిషేధములనుబట్టి సన్యాసిని, పరంపరాచార్యులనుగ నియమించ లేదు. ఎంబారుల నాచార్యపురుషులలో పరిగణించినను ఆ స్థానమునందు పరంపరగ సన్యాసులు గానరారు. అరుళాళ్ళ పెరుమాళెంబెరుమానారులను మఠాధిపతులనుగ నేర్పరచినను వారే దానినుత్సన్నమును జేసినందున వారిపూర్వాశ్రమ పుత్రులు, 'ఎచ్చాన్' అనువారు తండ్రిగారినే యాశ్రయించుటచే వారొక్కరే గృహస్థులైన యాచార్యపురుషులైరి. తక్కిన పుత్రులు స్మార్తులుగ నుండుటంబట్టి, యజ్ఞమూర్తి వారనే నామముతో నిప్పటికిని అద్వైతులుగనే యున్నారు. వారును భారద్వాజగోత్రులే. గనుక సన్యాసిపరంపర ఆచార్య పురుషులుగ నిర్దేశింపబడియుండలేదు. మరియును కలిలో సన్యాసి కాశ్రమభ్రంశము సులభము. ప్రాయశ్చిత్తమును గానరాదు. బ్రహ్మసూత్రమున: 'బహిస్తూభయథాపి స్మృతే రాచారాచ్చ'.

సన్యాసికి – ఉపపాతకముగాని, మహాపాతకముగాని సంభవించినచో బహిష్కరించదగునని చెప్పియున్నది. మరియు,

శ్లో॥ ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే ద్విజః ।
ప్రాయశ్చిత్తం నపశ్యామి యేన శుద్ధ్యే త్స ఆత్మహా ॥

అనగా : నైష్ఠికధర్మము ననగా సన్న్యాసమును ఆరోహించినవాడై ఆ యాశ్రమధర్మమునుండి భ్రష్టుడైనచో వా డాత్మహత్యజేసికొనినవాడుగనుకనే వానికి శుద్ధికర ప్రాయశ్చిత్తమును జూడలేదని తాత్పర్యము, ఇట్లు స్మృతిచెప్పియున్నందున రామానుజులవారు తమ పరంపరను మతపరం పరగ నేర్పరుపక గృహస్థ పరంపరారూపముగ నేర్పరచినారు.

జ్ఞానార్ణవమున :

శ్లో॥ వర్ణాశ్రమ పరిభ్రష్టా అత్రమేఖ్యః పరిచ్యుతాః ।
భిన్న దేశే ప్రపద్యంతే ప్రేతీభూతా యమక్షయే ॥
క్షుత్పిపాసాభితప్తా స్తే దహ్యమానా స్వకర్మభిః ।
స్వాని కర్మాణి శోచన్తే ప్రేతీభూతా యమక్షయే ॥

అన్యత్ర చ :

శ్లో॥ వర్ణాశ్రమ విరుద్ధంచ కర్మకుర్వన్తి యే నరాః ।
కర్మణా మనసా వాచా నిరయేషు పతన్తి తే ॥

వర్ణాశ్రమ పరిభ్రష్టులును, స్వాశ్రమ ధర్మములనుండి జారిపోయినవారును యమలోకమునందు ప్రేతీభూతులై భిన్న దేశములనుబొంది స్వకృతకర్మలచే దహింపబడుచూ క్షుత్పిపాసలచే తపింపబడుచు, తీవ్రవేదలనుపొంది స్వకృత కర్మలను గూర్చి దుఃఖించుచు నుందురనియును, ఏ మనుష్యులు వర్ణాశ్రమ విరుద్ధకర్మలను మనోవాక్కాయములచేతను జేసెదరో వారందరును నరకములయందు పడుదురనియు నున్నది. సన్న్యాసులకుమాత్ర మింద్రుడు శిక్షకుడని చెప్పియున్నది.

శ్రు॥ 'ఇంద్రో యతీన్ సాలావృకేభ్యః ప్రాయచ్ఛత్' అనగా, దోషులగు యతులను ఇంద్రుడు సాలావృకములకు, అనగా కుక్కలకు పడవేయునని చెప్పియున్నది. గృహస్థులకు దోషములు సంభవించినను ప్రాయశ్చిత్తాశనోద్యములు- 'అబ్భక్షో వాయుభక్షః' — అని సర్వభోగములు త్యజించి, 'అంగుష్ఠాగ్ర నిపీడితాం॥' అని యూర్ధ్వబాహువులై వేలతరబడి సంవత్సరములు తపస్సుచేయు విశ్వామిత్ర ప్రభృతులే, విషయప్రవణులై తపోభ్రష్టులైరి. ఇంద్రియ గ్రామమును జయించుట యెట్టివారికిని సాధ్యపడదు.

శ్లో॥ బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి॥

అనగా, యెట్టి విద్వాంసునినైనను యింద్రియములు విషయప్రవణునిగ జేయును. దీనిని జడభరత, సౌభర్యాదుల యందు జూడగలరు. ఇట్లుండ సర్వభోగములును కలిగియున్న యతుల కేమి చెప్పెదము-ఇవియన్నియు యోచించి రామానుజులవారు సన్యాసి పరంపర నేర్పరుపలేదు. రామానుజుల వారు సమాశ్రయణమును జేసినారని యనెదరు. అయితే వారిందునకే యుపమానమా? అన్నింటికినా? యనెడి యంశము యోచించవలసియున్నది.

శాస్త్రవిధులు కర్మవశ్యులై జనించువారికే గాని, అకర్మవశ్యులగు, నిత్యసూర్యావతారములకు గానేరవు. వారసంకుచిత జ్ఞానులు. శ్లో॥ 'అయోనిజా యోనిజాశ్చ దేవాజ్ఞా పరిపాలకాః'॥ అనియు, శ్లో॥ 'కలౌ కశ్చి ద్భవిష్యతి' యనియు, ఇత్యాద్యనేకశతవచనములు వా రవతార పురుషులని ప్రతి

పాదించి యున్నవి. శ్లో॥ మూాక మోాక్ష ప్రదాయకః॥ శ్లో॥ గోపికా మోాక్ష దాయకః॥ యనియు- శేషాంశం ధామ మామకం॥ యనియు, తిర్యగాదులకును మోాక్ష ప్రదులును, సాక్షాత్సర్వేశ్వరునకే ఆయాచార్యత్వపదమును బొందిన వారైన (శంఖచక్రప్రదాయకః) అనెడి నామమును ధరించిన వారును- యిట్టివారిని, కర్మవశులై జనించెడి మన సన్యాసుల కుపమానముగ నెంచుట యెందులకో తెలియలేదు. వారి కార్యములు వీరుచేయుదురా? వారెట్లు వర్తించినను కృష్ణ చరితమే

> శ్లో॥ అనుష్ఠితం తు యద్దైవైః ఋషిభి ర్య దనుష్ఠితం।
> నానుష్ఠేయం మనుష్యైస్తు ఉక్తం కర్మ సమాచరేత్॥

అనగా దేవతలును, ఋషులును అనుష్ఠించెడి వాటిని మనుష్యులు అనుష్ఠించదగరు. వారు చెప్పెడి వానినే అనుష్ఠించవలయునని భావము. శ్లో॥ 'తేజీయసాం నదోషాయ వహ్నె స్సర్వభుజో యథా'॥ అనియు - 'తేజోవిశేషాణాం ప్రత్యవాయో నవిద్యతే' అనియు, పెద్దఅగ్నియందు చిన్నపురుగు పడుటవంటివి వారియొక్క-వ్యాపారములు; మన వ్యాపారములు చిన్నదీపమున పెద్దపురుగు పడుటవంటివి; వారియొక్క జ్ఞానాగ్ని సర్వకర్మములను భస్మముచేయును; అని భగవద్వాక్యము. కాచినసీసమును త్రాగి శుక్రాచార్యులే జీర్ణముచేసుకొనగా, అసంకుచిత జ్ఞానులయొక్క-ప్రభావమేమిచెప్పగలము. శుక్రాచార్యులు కాచినసీసమును ద్రాగెను,కల్లును ద్రాగెను. మనము కల్లు త్రాగగలముగాని, కాచిన సీసమును త్రాగగలమా? కనుక అట్టివారి యుపమానము మన కెట్లన్వయించును. కనుక

శ్రామానుజుల వారికి- 'ప్రపీత విపతీర్థాంభః' అనిగదా తిరు నామము. అట్టివి వారికి ప్రత్యవాయజనకములు గానేరవు. మన సన్యాసుల కట్టి సామర్థ్యమున్నచో అన్నియును అనుష్ఠింపతగును. కలియందు పుణ్యబలము నశించి పాపబలము అధికముగ నుండుటంబట్టి కలివర్జ్యములయందు సన్యాసమును చేర్చబడి యున్నది. పామరభ్రామకమగు, జగద్గురువులని కింవదన్తి యొకటియున్నది. అయితే, అనేకమఠస్థులు, అనేక మతస్థులు, అనేకాచార్యపురుషులు, యిత్యాద్యనేకావాన్తర భేదము లేర్పడియున్న యీ స్వల్పఖండమునకే యనన్వితము. అయితే,

శ్లో॥ గతాను గతికో లోకో నలోకః పారమార్థికః ।
న్యస్తై వైస్తకలిజైస్తు నష్టం మే తామ్రభాజనం॥

అనునట్లు, గతానుగతికమేతప్ప పారమార్థికత యెచ్చటను గానరాదు. అర్థనిబన్ధనముగల సన్యాసమేగాని వైరాగ్య నిబన్ధనముగ గాజాలదు. ఆశ్రమము లాడంబరములు. జనాకర్షణకొరకై యేర్పడియున్నవేగాని పరమార్థమున కేర్పడ లేదు. ఇందుల కొక పురావృత్తమును పెద్దలు ప్రసాదించి యున్నారు.

పూర్వమున శ్రీరంగరాజభట్టరు పెద్దపరిషవముతో శిష్యయాత్రకు బైలుదేరి వెళ్ళిరి. మార్గమధ్యమున సింహాచల మను క్షేత్రమునకు వేంచేసిరి. అచ్చట పర్వతముక్రింద పరిషవమునుంచి ప్రచ్ఛన్నముగ తాముమాత్రము కొండమీదకు పెరుమాళ్ళసేవకై వేంచేసిరి. మార్గమధ్యమున గనుపించిన స్వాములకెల్ల దండమును సమర్పించుచు వెళ్ళిరి. వారు

మీా రెవరనిగాని, మీా దేయూరనిగాని యెుక్కరైనను అడిగి యుండలేదు. అటుపై పెరుమాళ్ళను సేవించుకొని క్రిందకు వేంచేశి మురునాడు, తిరుచిహ్నములు వగైరా పరిఛవములతో బైలుదేరగ, అందరూవచ్చి యెదుర్కొని దండములు సమర్పింప ప్రారంభించిరి. అందుకు వారు మంగళాశాసనముగాని, ప్రతివందనముగాని చేయక నాతిరుచిహ్నములకు, నా పల్లకికీ, నా శాలువకు ఇత్యాదులకు దండము సమర్పించుడని ప్రసాదించిరట. అందరునూయి దేమని యడుగగా భట్టరువారు, నిన్న వచ్చినవాడ నేగదా? అప్పుడులేని దిప్పుడు నా కేమివిశేషము వచ్చినది? ఈ యాడంబరమున కేగదా మీారు గౌరవించెదిరి? యని ప్రశ్నించినటుల చెప్పుచున్నారు. కనుక యిట్టి అడంబరము లేకపోయినచో వారిని గౌరవించువా రెవరు. ఇదొక విధముగు పటాటోపము ధనార్జనకు. అయితే గృహస్థునికి ధనలిప్స లేదా యని యనవచ్చును, వీనికి ధనార్జనకై వృత్తులు శాస్త్రవిహితమై యున్నందునను సర్వాశ్రమముల యొక్కయు, కుటుంబముయొక్కయు పోషణము వీని కేర్పడియున్నందునను న్యాయార్జితము దోషావహము గానేరదు. చక్రాంకితనమునకు శాస్త్రమునం దొక ప్రక్రియ యేర్పరుపబడియున్నది. అదెట్లనగ:

శ్లో॥ పురతోగ్నిం ప్రతిష్ఠాప్య స్వగృహోక్త విధానతః ।
ఇధ్మాధానాది పర్యంతం కృత్వా హోమం సమాపయేత్ ।
పౌరుషేణచ సూక్తేన జయాద్యైః జుహుయా ద్గురుః ।
మూలమన్త్రేణ జుహుయా దష్టోత్తరశతం తథా ।
వైష్ణవ్యా చైవ గాయత్ర్యా తద్విష్ణో రితి వై ఋచా ।
హుత్వా ప్రదక్షిణీకృత్య శిష్యేణ సహితో గురుః ।

పవిత్రే ణాంకయే త్పూర్వం బాహూ మూలం చ దక్షిణం।
శంఖేన ప్రతపే త్సవ్యం॥ —ఇత్యాది—

అగ్నిప్రతిష్ఠాపనను జేసి ఇధ్మాధానాదులచే హోమమును జేసి, పురుషసూక్తము చేతను, విష్ణుగాయత్రి చేతను, 'తద్విష్ణోః' అనే ఋక్కుచేతను, జయాదులచేతను హోమమును ముగించి యా యగ్నియందు తప్తముచేసి యంకనమును జేయవలయును. అగ్నికి శిష్యునితోగూడ ప్రదక్షిణమును జేయవలయునని యున్నది.

మరియు శ్రీవచనభూషణమున ౧౦౨ మీమాంసాగ్రన్థమున-

శ్లో॥ వక్ష్యామి మునయ స్సర్వే విష్ణోరాశ్రయణ క్రియాం।
మన్త్రదీక్షా విధించైవ తత్పూజన విధిం తథా॥
ఆద్యంతు శంఖ చక్రాది ధారణం వైష్ణవం స్మృతం।
పుండ్రం నామ క్రియా చైవ మన్త్రం చై వార్చనం హరేః॥
సంస్కారాః పంచ కర్తవ్యా బ్రాహ్మణస్య విధానతః।
తస్మా చ్చక్రాది సంస్కారాః కర్తవ్యా మునిసత్తమాః॥
చక్ర సంస్కార హీనేన కృతం కర్మహి నిష్ఫలం
స్నాత్వా శుచర్త్రే పూర్వాహ్ణే సమ్య గభ్యర్చ్య కేశవం
స్నాతం శిష్యం సమాహూయ కృత కౌతుక బన్ధనం
ప్రథమం తాపసంస్కారో వైష్ణవం మునిభిః స్మృతం
శంఖ చక్రాంకనం కురాద్భ్యాత్రిష్ణో బాహుమూలయోః
హుతాగ్నౌ చైవ సంతప్య సర్వపాపాపనుత్తయే॥

అనగా, ఓ మునులారా! విష్ణువు నాశ్రయించు క్రమమును, మంత్రదీక్షా విధిని, అతని పూజావిధిని చెప్పుచున్నాడను అని ప్రారంభించి ప్రథమతః వైష్ణవ లక్షణమగు పంచసంస్కారములను యథావిధిగ బ్రాహ్మణునికి జేయవలెను. ఈ బ్రాహ్మణ

శబ్దము ఇతరవర్ణములకును ఉపలక్షణము. శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యై శ్శూద్రైశ్చ కృతలక్షణైః। అర్చనీయశ్చ సేవ్యశ్చ॥ అని భారతమున శాంతిపర్వమున జెప్పియున్నందున 'అనుక్తమన్యతో గ్రాహ్యం' అనియున్నందున- గ్రహించవలయును. మొదట శంఖ చక్రాదిధారణము వైష్ణవలక్షణము. పంచ సంస్కారములను బ్రాహ్మణునికి యథాశాస్త్రముగ జేయువలయును. పంచ సంస్కార విహీనుడై చేయు కర్మ నిష్ఫలము. ఆచార్యుడు ప్రాతఃకాలమున స్నానమును జేసి తిరువారాధనను జేసి స్నానము జేసియున్న శిష్యుని బిలిచి హోమము చేయబడిన యగ్నియందు తప్తము చేసి బాహుమూలముల యందంకనమును జేయవలయును. (హుతాగ్నినైవ) అని చెప్పియుండుటచే అన్యథా కుంపటి వగైరాలలో తప్తముచేసి చేయరాదని యేవకారమువలన యేర్పడుచున్నది అన్యథా చేయుట వాతరోగముతో కూడుకున్న గొడ్డునకు కాల్చి వాత పెట్టుటవంటిది కాగలదు. మరియు

శ్లో॥ హోమాగ్ని సంతప్త పవిత్ర లాంఛితా
మూలేన బాహ్వోః పరమాత్మనో హరేః।
సంతారయిత్వా భవసాగరంమహా
త్పరంపదం యాతి పరేశలోకం॥

హోమాగ్నియందు సంతప్తమైన సుదర్శనాదులచే చిహ్నితులైనవారు సంసారమనెడి సాగరమును దాటి పరమపదమును పొందుదురని చెప్పినందున, యిందునకు భిన్నముగ అంకనమును జేసుకొనువారికి సద్గతి కలుగదని చెప్పియున్నది. పాపనివృత్తియును కలుగనేరదని వెనుకవచనములవలన యేర్పడుచున్నది. వ్యతిరేకప్రవర్తనకు ఫలమును జెప్పుచున్నారు:

శ్లో॥ అహూతాగ్న్యంకయిత్వా పరలోకం నవిందతి।
ఆచార్యో గార్దభీం యోనిం విందే చ్ఛిష్యోపి తాదృశీం॥

పూర్వోక్తమంత్రాదులచే హోమము జేయక అంకన మును జేసినయెడల పరమపదము గలుగదు; ఆచార్యులు, శిష్యులు గర్ధభయోనియందు జనింతురు అని అర్థము. ఇట్లు అన్వయవ్యతిరేకాదులచే జెప్పియున్నందున గృహస్థుడే పంచ సంస్కారములను జేయుట కధికారియనియును ఏర్పడినది.

శ్లో॥ తస్మా దగ్న్యధికార్యేవ గురు శ్చక్రాంకనం చరేత్ ।
కర్తా సుకృత మాప్నోతి శిష్య స్సద్గతి మాప్నుయాత్ ॥

ఈ హేతువుచే అగ్న్యధికారియగు గృహస్థుడే చక్రాంకనమును జేయవలయును. చేయువాడును, చేసుకొను శిష్యుడును సద్గతిని పొందగలరని ఏవకారమువలన స్పష్టమగుచున్నది. అగ్నియం దధికారము సన్యాసికి లేదుగనుక యతుల కనన్వితమగును. అనధికారివద్ద దీనిని లభించుటగాని, యనధికారి దీనిని జేయుటగాని యుభయపాతకమందును. అయితే, శ్లో॥ దేవాలయాగ్నౌ కుర్వీత యతి స్తాపాది సంస్క్రియాః॥ అను శ్రీవిష్ణు తిలక వచనము యతులకు సాధకమందురేమో, అది విచారించి నచో అనన్వితముగనున్నది. అగ్న్యధికారమే లేనప్పుడు దేవాలయాగ్నియం దెట్లధికారము గలుగును. అది శబ్దముచే పాకాదులకును అధికారము కలుగవలసియుండును. శ్లో॥ 'న శిష్యసంగ్రహం కుర్యా న్నస్వవిద్యాం ప్రకాశయేత్॥ అనియు 'యస్తు దానపరో భిక్షు శ్శిష్యాదీనాంచ సంగ్రహీ॥ అనెడు శంఖలిఖిత- జాబాలి వచనములవలన శిష్యసంగ్రహాధికారమే లేనప్పుడు శిష్యసంగ్రహాధికారవిధి యెట్లన్వయించును? పరస్పర విరోధము; మరియు దేవాలయము లేనిచోట చేయు

చక్రాంకనమునకు గతియేమి? గృహార్చనాదులకు దేవాలయ మని నామము గానరాదు; ప్రసిద్ధియులేదు. మరియును తాపము మాత్రమే యగ్నియందు జేయవచ్చునుగాని శిష్యునికి జేయు తగిన సంస్కారము లగ్నియం దెట్లు సంభవించును? తృతీయావిభక్తి లేకుండుటయు; సప్తమీ విభక్తియుండుటయు విరుద్ధము తాపము మాత్రమే యగ్నిసాధ్యమనిన 'సంస్క్రియాః' అనుపదము నిరర్థకము. మరియును తాపమును నాదిగ గలవి సంస్కారములనిన బహువ్రీహిలో నన్యపదార్థప్రాధాన్య మగుటచే తాప మన్వయించదు. తద్గుణసంవిద్జ్ఞాన బహువ్రీహినిగల్పించినను 'ఆదిసంస్క్రియాః' అను పదములు వ్యర్థములగును. ఇంకను ననేకవిరోధములేర్పడి యున్నందున యితర ప్రమాణములులేక యీ యొక్కవచనముచేతనే యిష్టార్థమును సాధించ వీలుగనుపించదు గనుక విష్ణుతిలక వచనము ఇందుకు ప్రమాణము కాజాలదని యెరుగుడు. నిషేధవచన బాహుళ్యముచే (సువర్ణం, రజతం, తామ్రం, అని) యిత్యాది లోహములను స్పృశించగూడదని నిషేధించియున్నప్పుడు ద్రవ్యార్జననిమిత్తము వైశ్య శూద్రాదుల గృహములకు వెళ్లుట కెట్లు శాస్త్రము లొప్పును? సన్యాసమునకే కాలాతిక్రమణమున నిషేధమున్నప్పుడు సమాశ్రయణమునకు ప్రసక్తియే లేదు ఐనను అన్యాయమహ్యావాదముగ వ్రాయబడినది. ముఖ్యము సంభవించునపుడు గౌణమునకే ప్రసక్తిలేదు (తస్మాచ్ఛ్రేష్ఠో గృహాశ్రమీ) అనియున్నది గనుక– 'గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః' యని గృహస్థులు సిద్ధించుచున్నప్పుడు అశాస్త్రీయ సన్యాసుల నాశ్రయించుట మిక్కిలి పాతక

హేతువు. ఇప్పటి సన్యాసము వసంతకాలమున విధించిన జ్యోతిష్టోమమును, వర్షఋతువునందు జేయుటవంటిదియగును. రామానుజులు, ఆళవందారులు, మణవాళమామునులు, మొదలగువారు గృహస్థశిష్యులు గారా? వారికేమి లోపముకలిగినది? రామాద్యవతారములయందును గృహస్థులనే యాచార్యులగ వరించి సర్వమును గ్రహించినట్లు కానబడుచున్నది. గృహస్థులకన్న సన్యాసు లధికు లనుకొనుట మిక్కిలి యజ్ఞానమనియే చెప్పతగినది. శ్లో॥ 'గృహస్థం బ్రహ్మవిత్తమం'; 'యువానం గృహమేధినం'; 'గృహస్థో దేశికోత్తమః'; 'గృహస్థం సుగుణోపేతం'; 'గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః'; 'తస్మాచ్ఛ్రేష్ఠో గృహాశ్రమీ'; 'విశేషేణ గృహస్థస్య'; 'తద్వంశ సంభవంవాపి'; 'తస్మాదగ్న్యధికార్యేవ గురుశ్చ శ్రాంకనం చరేత్' ఇత్యాద్యనేక వచనములు సోపపత్తికముగ గృహస్థుడే యాచార్యుడుగ నుండవలయుననియు, కులక్రమగతాచార్యులను విడువగూడదనియు (తస్మిన్నభిజన విద్యాసముదేతం) అనియు, జెప్పియున్నందున విశేషముగ సమాశ్రయణాధికారము గృహస్థునికే కానబడుచున్నందున, ఇతరుల నాశ్రయించుట నరకావహామే. కాలక్షేప జీయరనియు, తిరువారాధన జీయరనియు, పరిచారక జీయరనియు గానబడుచున్నదేకాని సమాశ్రయణ జీయరని యెవరును గానరారు. కందాడై వారిశిష్యులు, వారు జ్ఞానులుగాని, అజ్ఞానులుగాని వారినేతప్ప ఇతరుల నాశ్రయించరు వారి శిష్యకోటిలో జేరియుండు వైష్ణవజాలమంతయును పుత్రపౌత్రాభివృద్ధి కలిగియున్నారు. ఇతరత్ర ఆశ్రయించువారి కభివృద్ధి విశేషముగ కానరాదు.

శ్రు॥ పరీక్ష్య లోకాన్ కర్మచితాన్; అనెడి శ్రుతి యందు 'సమిత్పాణిః'అని శిష్యునికి విశేషణముగనున్నందున, ఆశ్రయించునపుడు గృహస్థుడుగనే యుండవలయు ననుసంగతి స్పష్టముగ గనుపించుచున్నది. 'సమిద్భారగృహీతహస్తః' అని శ్రీవచనభూషణాది గ్రన్థములయందును, శంకరవ్యాఖ్య యందును గానబడుచున్నది. శ్రుతియందు జెప్పియుండుటం బట్టి యిట్టిశ్రుతికి విరోధముగు వచనముల కప్రామాణ్యతను జెప్పకతప్పదు. 'విరోధే త్వనపేక్షం స్యాత్' అని. వేదవిరుద్ధ మనాదరణీయము.

శ్లో॥ శ్రుతి స్మృతి పురాణానాం విరోధో యత్ర దృశ్యతే।
తత్ర శ్రుతిః ప్రమాణం స్యాత్తయో ర్ద్వైధే స్మృతిః పరా॥

శ్రుతికి భిన్నముగ నర్థమును చెప్పదగదు. విరోధముగ నున్న వచనముల కప్రామాణ్యమును జెప్పవలసియుండును. తప్పదు. శిష్యుడు తన వంశవృద్ధిని కోరినవాడైనయెడల కులక్రమాగతాచార్యులనే వెదకి వారినే యాశ్రయించవల యును; అనుదానికి ప్రమాణము.

శ్లో॥ ఉద్ధర్తుం నిజవంశౌఘాన్ త్వైకం యది వాంఛతి।
తమేవాన్వేషయేత్తస్మాత్సర్వజ్ఞం దేశికం తతః॥

తన వంశమును ఉద్ధరించువారు కులక్రమాగతా చార్యులే గనుక వారినే యాశ్రయించుమని చెప్పియున్నది. పరమ పురుష సంహితయందు: శ్లో॥ గురుదార సుతాదౌ తు గురువద్వృత్తి మాచరేత్॥ అనగా గురుదార సుతాదుల యందు గురువృత్తినే చేయవలయునని భావము. దారలయందు సర్వథా అట్టివృత్తిని చేయరాదు, యథోచితవృత్తినే చేయ

దగును. స్త్రీలవలన ఉపదేశాదులను లభించుట శాస్త్రవిరుద్ధము. పాదసంవాహనాదులు పురుషులు చేయదగదు. ఇత్యాది వచనములు తెలిసియూ ఇతర శిష్యులకు సమాశ్రయణాదులు చేయుట; 'ఏకః షో దంశ భూయస్త్వ' మను వచనముచే– ద్విగుణ దండమునకే యుక్తులు. ఇట్టి గుర్వంతరాశ్రయణాదులు మెట్టు ప్రపన్నులమని కొంటూ ఉదుమణో కాపులు కాలక్షేపాలు చేయు వైశ్యులయందు విశేషముగ కానబడుచున్నది. శ్లో॥ జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి॥ అనునట్లు జ్ఞానలవముచే దుర్విదగ్ధులగువారిని బ్రహ్మయైననూ సంతోషపెట్టజాలడు. రావణాదులను వలె. దేవీభాగవతే:–

శ్లో॥ మహాన్తో ఏ చ ధర్మజ్ఞా అధర్మం కుర్వతో నృప।
కలి స్వభావ ఏవైష పరిహార్యో న కేనచిత్ ॥

ఈ కలియందు గొప్పజ్ఞానులైనను అధర్మమునే చేయుదురు. ఇట్లు చేయుటయే కలిస్వభావము. ఎట్టివారికినీ 'అపరిహార్యము' అని చెప్పియున్నది ఇట్టిస్థితిలో నల్పజ్ఞుల కేమి చెప్పందగును. సమాశ్రయణమునందు ప్రామాణ్యము చేసుకొను క్రమమునందప్రామాణ్యము. ఇట్టివారినే ఆస్తిక నాస్తికులని యందురు.

ఇది యిట్లుండగ బ్రాహ్మణేతరులు సమాశ్రయణము జేయుటయు, కాలక్షేపాదులు చెప్పటయు ప్రారంభించియున్నారు. ఇంతవరకు బ్రాహ్మణ శ్రీవైష్ణవేతరులు సమాశ్రయణమును చేసినారనిగాని, కాలక్షేపాదులు చెప్పినారనిగాని వినియుండలేదు; చూచియుండలేదు. శాస్త్రము

నం బట్టి యధికారమును కానరాదు. మరియు నిషేధమును మాత్రము చూచుచున్నారము. ఆస్తికులయొక్క ప్రవృత్తి నివృత్తులకు ముఖ్య ప్రమాణము వేదశాస్త్రములు, తన్మూలక స్మృతీతిహాస పురాణాదులును. ఏతదవిరుద్ధ శిష్టాచారము ప్రమాణము.

శ్లో॥ శబ్దప్రమాణగమ్యే ఽర్థే యథా శబ్దవ్యవస్థితిః ॥

ప్రత్యక్షానుమానములచే యెరుగరాని శాస్త్రార్థములన్నియు శాస్త్రముచేతనే యెరుంగతగినది. అని శ్రీ యామునాచార్యులవారు నిర్ణయించియున్నారు.

శ్లో॥ 'అనాది నిధనా హ్యేషా వాగుత్సృష్టా స్వయంభువా'
శ్రు॥ 'సాహి శ్రీ రమృతాసతాం' 'అదౌ వేదాః ప్రమాణం'

అనియు; వేదము పౌరుషేయము మనియు; ఆనుపూర్వీకా నిత్యత్వము వేదమునకే యున్నదనియు, ఆస్తికులందరును ఒప్పుకొన్నదే. కనుక వేదమున వర్ణవిభాగము, వృత్తులు సృష్టియందే కలిగియున్నట్లు బృహదారణ్యకమున స్పష్టముగ కానబడుచున్నది. అదెట్లనిన-సృష్ట్యాదియందు బ్రాహ్మణ కులమును ప్రథమతః సృజించి నాడనియు- అది పరిపాలనాదుల కసమర్థ మగుటంబట్టి యందుకై తిరుగ క్షత్రియ వర్ణమును సృజించి నాడనియును, అది యర్థార్జన కసమర్థమగుటంబట్టి వ్యాపారాదులమూలముగ ధనార్జనకొరకై వైశ్యజాతిని సృజించినాడనియు, పరిచారికమన్తరా ధనార్జనచేయుటకును, కృష్యాదులకును అసాధ్యముగనుక దానికై శూద్రజాతిని సృజించినాడనియు, ఇట్లు వృత్తిసాంకర్యాదులు కలుగకుండుటకు వర్ణచతుష్టయమును సాక్షాత్సర్వేశ్వరుడే పూర్వ

సృష్టిని అనుసరించి "ధాతా యథాపూర్వ మకల్పయత్"అని తత్తచ్ఛేతన కర్మానుగుణముగ, సృజించినట్లు చెప్పి యున్నది. ఇట్టి భేదము దేవతలయందును కలిగియున్నది.— బ్రాహ్మణులు బృహస్పతి, శుక్రులు; అగ్ని వగైరాలు క్షత్రియులు; ఇంద్ర వరుణ సోమ వస్వాదులు వైశ్యులు; బుధ మరుత్తులు మొదలగువారు శూద్రులు. అశ్వనీదేవ తలు మొదలగువారు యింకను సంకరజాతులవారలుగను ఉన్నట్లున్నది. ఇదిగాక సంహితలోను, పరాయతములోను యున్నది. ఈ విషయమును మత్కృత వర్ణాశ్రమధర్మ ప్రదీప మున విశేషముగ పూర్వపక్ష సిద్ధాంతములచే స్థిరీకరించబడి యున్నది. మరియు కాశీక్షేత్రమున ధర్మ ప్రదీపమును గ్రన్థములో విశేషించి వ్రాయబడియున్నది. జాతి భేదము నవగ్రహములలోను కానబడి జోస్యములో జననాదులను గ్రహస్థితులవలన జాతిగూడ నిర్ణయించి చెప్పుచునారు. ఇది ప్రత్యక్షము. అపలాపము జేయ నలవిగాదు. కర్మానుగుణ ముగ జీవరాసులు దేవ తిర్య ఙ్మనుష్య స్థావరరూపేణ జనించు చున్నారు. ఇట్లు కానిచో జీవరాసులను ఒక్క రీతిగనే సృజిం చక పోవుటకు కారణ మేమి చెప్పెదరు? మనుష్యులలోనే బుద్ధులు, రూపములు, గుణములు, వ్యాపారములు, ప్రవృ త్తులు వేరువేరుగ గనుపించుచున్నవి- గుణ కర్మ విభాగము చేతనే వర్ణభేద మేర్పడినట్లు భగవన్తుడే చెప్పియున్నాడు.

గీతాయాం :

శ్లో॥ చాతు ర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయం॥

అని సత్వాది గుణములయొక్కయు, ఆ యా గుణము

లక్షం దగిన శమాది వ్యాపారములయొక్కయు విభాగము చొప్పున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లను నాలుగు వర్ణములును, ఆ వర్ణములు మొదలుగ బ్రహ్మాది స్థంభ పర్యంతమైన సమస్త జగత్తును నాచే సృజించబడియున్నది; రక్షించబడుచున్నది; సంహరించంబడుచున్నది- ఆసృష్టి మొదలగువానికి నేనే కర్తనైనను, కర్తగాని వానినిగ దెలుసుకొనుము. అని తానే చెప్పియున్నాడు- మరియును అవాంతర భేదమే లేక మనుష్యత్వము ధర్మ మందరికిని ఒకటే యయినచో, తిర్యక్త్వమునంగూడ వ్యాఘ్ర, గోత్వాద్యవాంతర భేద ధర్మాదులు లేక యొకటిగానే వ్యవహరించి శాధ్య బాధకాదులు కలుగనట్లుచేయించగలమా యని యోచించవలయును. ఒక మామిడి జాతి యొక్కటియైనను గుణభేదముచే అవాంతర భేదము లెన్నో కనుపించుట ప్రత్యక్షమేగదా? అన్నిటిని ఏకరసముగ ననుభవించగలరా? జాతి యొక్కటైయున్నను ఆహార భేదముచేతను, గుణభేదమును ఒప్పుకొనక తప్పదు. అవి జన్మసిద్ధములే కాని, యొకరిచే నేర్పరుపబడినవి గావు. అట్లనుట ప్రత్యక్షాపలాపము - గుణభేదములు పూర్వజన్మకృత కర్మభేదములచేత ననగ పుణ్యాపాప రూప భేదములచే యేర్పడినవేగాని యొకరు చేయించినందున యేర్పడినవి గావు-

శ్లో॥ తమ శ్శూద్రే రజః క్షత్రే బ్రాహ్మణే సత్వము త్తమం॥

ఆయా వర్ణముల కాయా గుణములను విభజించి పెట్టుట నెరుంగవలయును. చిత్తూరు, మల్గోవా, బంగినిపల్లి, రసాలు, పీతరు, ఖాదరు, గద్దేమారు, నీలం మొదలగునవి మామిడి అను పదముచే ఏకజాతిత్వేన వ్యవహరించినను,

అవాంతరభేదములనుబట్టి గుణభేదేన ఏ యేవిధముగ రస నేంద్రియమున నుపయోగించుకొనవలయునో యట్లులనే వాని వాని నుపయోగించుకొనుచున్నాముగదా. అట్లే బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ శూద్రత్వములను లోకోపకారార్థమై యీశ్వరుడు ఉపయోగపడుటకై యేర్పరచి యున్నాడు. ఆయా వర్ణముల సత్త్వాదిగుణములకు దగిన శమాది గుణకర్మల విభాగము గీత 13 అధ్యాయమున శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం। అను 41 శ్లోకము మొదలు శూద్రస్యాపి స్వభావజం॥ అను శ్లోకము వరకు తెలుపబడి యున్నది.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః॥

అర్జునా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనెడు నాలుగు వర్ణములవారికిని ఆ యా బ్రాహ్మణాది జన్మములు కలుగుటకు వారి వారి ప్రాచీనకర్మలే హేతువులు. ఆ యా కర్మలవలన వారి వారి కా యా గుణములు వేరు వేరుగ గలుగుచున్నవి ఆ యా గుణములను బట్టియు వారి వారి కా యా కర్మలు వేరు వేరుగ శాస్త్రమున ప్రతిపాదించ బడియున్నవి. అనగ ఈ గుణములుకల యీ యీ బ్రాహ్మణాదులకు నీ యీ కర్మలును, వృత్తులును వలయు నని శాస్త్రమున నాలుగు జాతులవారికిని వేరు వేరుగ వృత్తి కర్మలను విభజించి ప్రతిపాదించుచున్నవని భావము. దీనిని గురించి వర్ణాశ్రమ ప్రదీపమను గ్రంథములో విశేషించి వ్రాసి యున్నాము కనుక నిందు విస్తరించ లేదు. గీతలయందు భగవంతుడు, వర్ణాశ్రమ ధర్మములనే విస్తరించి బోధించియు

న్నాడు. కనుకనే శ్లో॥ 'కరిష్యే వచనం తవ॥' యని తన వర్ణమునకు యోగ్యమగు యుద్ధమును చేసెదని చెప్పి— అర్జునుడు యుద్ధమును జేసెను. వ్యాఖ్యాతలు 'యుద్ధం కరిష్యే' యని వ్యాఖ్యానమును జేసిరి. కనుక వర్ణాశ్రమధర్మముల నపలాపము జేయుట యాస్తికుల కనుచితము. సృష్టి యందే వర్ణవిభాగ మేర్పడి యున్నట్లు వ్యాసులవారే వక్కాణించియున్నారు.

సూ॥ వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వా త్తథాహి దర్శయతి ।

అనగా ఈశ్వరునకి విషమ సృష్టిచే వైషమ్య నైర్ఘృణ్యములు సిద్ధించునని శంకించుకొని— చేతన కృత ప్రాచీన కర్మ సాపేక్షుండై నిమిత్తమాత్రుడై సృష్టిని చేయునుగనుక వైషమ్య నైర్ఘృణ్యములు రానేరవనిరి. ఇందునకు ప్రమాణము విష్ణుపురాణే — భగవతా పరాశరేణాపి ॥

శ్లో॥ నిమిత్తమాత్ర మేవాసౌ సృజ్యానాం సర్గకర్మణి ॥
ప్రధాన కారణీభూతా యతో వై సృజ్య శక్తయః ॥

ఈశ్వరుండు చేతనులయొక్క శరీర సంయోగము లకు సృష్టియందు నిమిత్తకారణమే యగును; ప్రధానకారణములు చేతనులయొక్క ప్రాచీనకర్మలు. పుణ్యా పాప రూప కర్మలచే ఉత్కృష్టాపకృష్ట జన్మ లేర్పడును.

ఇందునకు శ్రుతి :

సాధుకారీ సాధు ర్భవతి; పాపకారీ పాపో భవతి;
పుణ్యః పుణ్యేన కర్మణా భవతి; పాపః పాపేన కర్మణా॥

యని. క్షేత్ర సలిలాదులు సర్వసస్య సాధారణకారణములు— తత్తద్బీజశక్తి విశేషము లంకుర విశేషోత్పత్తియం

దెట్లు సాధారణ కారణములో యట్లే యీశ్వరుడును - సృష్టికి సాధారణకారణము - చేతన కృత ప్రాచీన కర్మలు - బ్రాహ్మణత్వ- క్షత్రియత్వ - వైశ్యత్వ - శూద్రత్వ- ఛండాలత్వాదులకు సాధారణ (ప్రధాన) కారణమని పెద్దలు జెప్పు చున్నారు. ఒక రిట్లు చేసిరనుట మిక్కిలి వెర్రితనము- హైందవ మత విరుద్ధము. జన్మప్రభృతి విదేశీయ భాషా పరిచయ మాహాత్మ్యముగనుక గ్రన్థావలోకనమూలము, కనుక జాతులును భేదములును అనాది - మరియు బ్రాహ్మణునికేర్పడిన కర్మలు:- యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము అను ౬. క్షత్రియ వైశ్యులకు 3 యజనము, అధ్యయనము, దానము. బ్రాహ్మణునికి తక్కినవి 3 ను జీవికకే యేర్పడినవి. అధ్యాపనాదులు బ్రాహ్మణునికే తప్ప యితరులకు లేవు.

శ్లో॥ అధ్యేతవ్యం బ్రాహ్మణేన వైశ్యేన క్షత్రియేన చ।
శ్రోతవ్యమేవ శూద్రేణ నాధ్యేతవ్యం కదాచన॥
శ్రౌతం స్మార్తంచ వైధర్మం ప్రోక్త మస్మిన్ నృపోత్తమ।
తస్మా చ్ఛూద్రై ర్వినావిప్రం నశ్రోతవ్యం కదాచన॥

యని శూలపాణి గ్రన్థమందు పురాణాధికారమున భవిష్యత్పురాణ వచన ముదాహరించబడినది. అనగ బ్రహ్మ, క్షత్రియ, వైశ్యు లధ్యయనము జేయవచ్చును. శూద్రుడు వినవలయునే గాని చదువరాదు.

శ్లో॥ నవేదోహ్యధికారోహి కశ్చిచ్ఛూద్రస్య విద్యతే।
పురాణే ష్వధికారో మే దర్శితో బ్రాహ్మణై రిహ॥

ఇట్లు పాద్మవచనమని, శూలపాణి గ్రన్థమున వ్రాయబడియున్నదని శూద్రకమలాకర స్మృతిః విలోమజానాం తు

శ్రవణాదౌ నాధికారః సూతాదేస్తు. శ్లో॥ ధర్మ్యఏవ హి సూతస్య సద్భిర్దృష్టః పురాతనైః॥ శూద్రు డధ్యయనమును జేయ గూడదనియును పురాణాదులు బ్రాహ్మణునిద్వారా వినవల యుననియును సూతుడు యమాంశముగాబట్టి యతనికే తగు ననియును జెప్పియున్నది. ఇట్టివాని నుపమానముగ జేసుకొన దగదు. వినుటకే మాత్రము అధికారమును జెప్పియున్నందున, అధ్యాపన కెట్లు అధికారము గలుగును. సామాన్యముగ వేదాధ్యయనాధ్యాపనాధికారమే లేనప్పుడు బ్రహ్మవిద్యోప దేశాధికార మెక్కడిది? ఇక బ్రాహ్మణులలోను, వైష్ణ వాగ్రేసరులైనవారికే॥ 'అసావసావిద్యా భగవత్తః' అను లక్షణము కలిగియుండియు 'స చాచార్యవంశో జ్ఞేయః' అను వచనముతో జేయవలసియున్నందున భగవద్రామానుజ సిద్ధాన్తమున తదాజ్ఞాపిత చతుస్సప్తతి వంశాన్తర్గతులుకానిచో అనధికారము సిద్ధించుననన విశిష్టసమాశ్రయణవిషయము బ్రాహ్మణేతరుల కనధికారము కింపునర్న్యాయసిద్ధముకదా? శ్లో॥ శూద్రయోనా వహం జాతః నాధర్మం వక్తు ముత్సహే॥ అని శూద్రయోనియందు జనించినందున ధర్మముల నితరు లకు జెప్పుట కుత్సహించను అని యున్నది.

శ్లో॥ నశూద్రాయ మతిం దద్యాత్ నచాస్యోపదిశే ద్ధర్మం॥
శ్రావయే చ్చతురోవర్ణాన్ కృత్వా బ్రాహ్మణ మగ్రతః
స్త్రీ శూద్ర ద్విజ బన్ధూనాం త్రయీ న శ్రుతిగోచరాః॥
నాధ్యేతవ్య మిదం శాస్త్రం వృషలస్యచ సన్నిధౌ॥
యో ధీతే చైవ మోహాత్మా స యాతి నరకా బహూన్॥

అని శూద్రునికి బ్రహ్మవిద్య నుపదేశించగూడదనియు, ధర్మము నుపదేశింపరాదనియు, బ్రాహ్మణుని ముందుంచుకుని

వినవచ్చుననియు, శూద్రుని ఎదుట నధ్యయనము జేయరాద నియు, అధ్యయనము జేసిన శూద్రు డనేక నరకములను పొందగలడనియును, 'శ్రవణమియాచ్ఛ్రవణమియాచ్ఛూద్ర జాతిః' అనగా వినుటవలన శూద్రుడు సద్గతినొందగలడనియు, శూద్రుడు సుఖమును పొందువాడనెడు వచనముకు యితర వచన పర్యాలోచనయా శ్రవణమే అర్థమని చెప్పబడియున్నది. కనుకనే వేదాధ్యయనాదులు స్త్రీ శూద్రులకు గూడదని యున్నందున సమాశ్రయణాద్యధికారము లేక బ్రాహ్మణే తరు లాచార్యులుగ నున్నారని శంకించెదరు.

శ్లో॥ మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వన్తి యే జనాః
శూద్రంవా భగవద్భక్తం నిషాదం శ్వపచం తథా
వీక్షతే జాతి సామాన్యా త్స యాతి నరకం నరః
యః పశ్యతి శుభాచారం వైష్ణవం వీతకల్మషం
యస్మిన్ కస్మిన్ కులేజాతం ప్రణమే ద్దండవ ద్భువి
మద్భక్త జనవాత్సల్యం' అని ప్రారంభించి—
భక్తి రష్ట విధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే॥
స విప్రేన్ద్రో ముని శ్రీమాన్ స యతి స్స చ పండితః।
న మే ప్రియ శ్చతుర్వేదీ మద్భక్త శ్శ్వపచోపి యః
తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథాహ్యహం॥

అనియు,

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యే పి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాన్తి పరాంగతిం।
ఏకాన్తే వ్యపదేష్టవ్యో నైవ గ్రామ కులాదిభిః।
విష్ణునా వ్యపదేష్టవ్య స్తస్య సర్వం స ఏవ హి॥

ఆళ్వార్లు॥ ఛండాల ఛండాలర్గళాకిలుం వలంపాం గుళక్కరత్తణ్ణాల్ మణివణ్ణర్ కాళైన్నాళ్ కలందార్

అడియార్ తమ్మడియా రెమ్మడిగళే ॥ అని తిరువాయ్ మొళియందును ప్రసాదించి యున్నారు. అనగ, భగవద్భక్తు లెట్టిజాతివారైనను పూజ్యులనియును, అట్టివారిని దూషించి నను, జాతి సామాన్యులుగ తలచినను నాభక్తులగుటచే వారి విషయమునందపచారపడువారు నన్ను పద్మకోట్లచే పూజించి నను క్షమించను,అనియు, గ్రామకులాదులచే వారినన్యథాగా చూడగూడదనియు, వారి కంతయు సర్వేశ్వరుడే యనియును, అట్టివారిని చూచిన మాత్రముననే దండము సమర్పించి పూజించవలయు ననియును ఉన్నప్పుడు విరుద్ధముగాదా? మీవాదమనియును, ఆళ్వార్లు మొదలగువారిని విగ్రహరూప ముగ ప్రతిష్ఠించి సన్నిధులయం దారాధించుచూ వారిప్రబన్ధ ములను అనుసంధించుచూ విశేష గౌరవముతో నారాధించు చున్నారనియును జెప్పెదరు, వాస్తవమే. మరియు శ్రీవచన భూషణమునందు కర్మచండాలాపేక్షయా జాతిచండాలుడు శ్రేష్ఠుడనియును, ఇతరజాతులకు నైచ్యము జన్మసిద్ధమనియును బ్రాహ్మణునికి శాస్త్రజ్ఞానాదులచేత కలిగిన స్వరూపజ్ఞానము చేతను ఆరోపితమనియును యింకను అనేక పురావృత్తము లతో ప్రసాదించియున్నారు - ఇందుల కేమియు సందే హము లేదు. వాస్తవమేగాని, ఇంతమాత్రముచే జాతి కా ఆధిక్యము రానేరదు. ఇవియన్నియు భగవద్భక్తి ప్రాశస్త్య పరములేగాని జాతిసామాన్య ప్రాశస్త్యపరములు గానేరవు. శ్వపచత్వ- నిషాదత్వ - శూద్రత్వ-మ్లేచ్ఛత్వాది జాతి నిష్కృ మైన పాపయోనిత్వమును స్థిరపరచి, వ్యక్తినిష్ఠ, విష్ణుభక్తి ప్రాశస్త్యమును బోధించినవి. ఇం మాత్రముననే బ్రాహ్మ ణ్యమును నిందించుటగాదు. కింతు బ్రాహ్మణునికి ముఖ్యముగ

భగవద్భక్తియుండవలయునని చెప్పినట్లైనది. భక్తియున్నంత మాత్రమున ఛండాలత్వాదులు పోనేరవు. మటత్వ ధర్మము మారి పటత్వ మగుట కానరాదు. సురభియైనను గోత్వము మారునా? భక్తినిబట్టి నింద్యార్హుడు గానేరడు. భక్తినిబట్టి గౌరవనీయుడు - నహినిందాన్యాయముచే బ్రాహ్మణ నిందాపరము గానేరదు.

'కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాభక్తా రాజర్షయ స్తథా' అనగా పుణ్యాః + పుణ్యయోనయః, భక్తా + బ్రాహ్మణాః తథా రాజర్షయశ్చ కిం పునః పరాంగతిం యాన్తీతి కిముపవక్తవ్యం' అని కింపునర్న్యాయ సిద్ధము, శరీరగతమైన యుత్కృష్టాపకృష్టత్వములు మారవు. బ్రాహ్మణుడు స్వధర్మ భ్రష్టుడైనను, బ్రాహ్మణ్యము పోజాలదు. పరాశరులు. శ్లో॥ యుగరూపాహి తే ద్విజాః తేషాం నిందా న కర్తవ్యా॥ ' అని విష్ణుపురాణమునందు జెప్పియున్నారు. బంగినపల్లి మామిడి కుళ్లిననూ - బంగినపల్లి మామిడిపండు కుళ్లిపోయిన దని అందురేగాని ఇంకొక జాతి మామిడి కుళ్లినదని అనరు గదా? పతితుడైనయెడల పూజార్హుడు కానేరడు. ఈ ధర్మము అన్ని జాతులయందును సమానమే. భగవదాజ్ఞా రూప వర్ణాశ్రమ వ్యవస్థ నతిక్రమింప శక్యము గానేరదు. ఇందు విషయమై పూర్వమే చెప్పియున్నాము. తిరుగ విశేషముగ జెప్పుచున్నాము.

జ్ఞానార్ణవే॥ జ్ఞానినోఽ జ్ఞానినోవాఽపి యావ ద్దేహస్య ధారణం।
తావ ద్వర్ణాశ్రమం ప్రోక్తం కర్తవ్యం కర్మముక్తయే ॥
బ్రాహ్మణః క్షత్రియో వైశ్య శ్శూద్రశ్చ పృథివీపతే।
స్వధర్మ తత్పరో నిత్య మారాధయతి నా న్యథా ॥

వర్ణానా మాశ్రమాణాం చ వ్యవస్థా యా మయా కృతా
తాం యే సమనువర్తంతే ప్రసాద స్తేషు మే మహాన్ ।
వర్ణాశ్రమా చార వతా పురుషేణ పరః పుమాన్
విష్ణు రారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః ॥
న చలతి నిజవర్ణధర్మతో య స్సమమతి రాత్మ సుహృ ద్విపక్ష పక్షే ।
న హరతి, నచ హన్తి కించి దుచ్చైః స్థిరమనసం త మవేహి విష్ణుభక్తం ॥

అనగా జ్ఞానిగాని, అజ్ఞానిగాని దేహముండువరకు కర్మ విముక్తికై వర్ణాశ్రమ ధర్మములను చెప్పబడినవానిని జేయ వలయును. బ్రాహ్మణుండుగాని, క్షత్రియుడుగాని, వైశ్యుండు గాని, స్వవర్ణోచిత ధర్మమును ఎల్లప్పుడునువిడువక స న్నారా ధించవలయును. అన్యథా యారాధించ దగదు.

వర్ణాశ్రమములయొక్క యెట్టి వ్యవస్థ నాచేత చేయ బడియున్నదో, ఆ వ్యవస్థను, యెవ రనుసరించియుందురో వారియందు నాకు గొప్ప యనుగ్రహము గలుగును.

వర్ణాశ్రమాచారములుగల పురుషునిచే పరమపురుషు డారాధించబడును. ఇంతకన్న వానిని పొందుటకు సంతోష మును కలిగించు మార్గములేదు.

వర్ణ ధర్మమువలన చలించక శత్రు మిత్రులయందు సమానబుద్ధికలిగియుండువానిని హరించరు. చంపరు. గొప్ప స్థిరమగు మనస్సుగల విష్ణుభక్తి గలవానినిగ తెలుసుకొనుము అని యిట్లు జెప్పిరి. ఇట్లుండువ్యవస్థ నతిక్రమించినవానిని చేయు క్రమమును నిగ్రహాకార్యమును జెప్పుచున్నారు:

ప్రియోపి న ప్రియోసౌ మే మ దాజ్ఞా వ్యతివర్తనాత్
మచ్ఛినీ వైదికాచారం మనసాపి న లంఘయేత్ ॥

లంఘయన్ శూల మారోహే దనపేక్షోపి తాం ప్రతి
ఏవం విలంఘయన్ మర్త్యో మర్యాదాం వేదనిర్మితామ్ ॥

పండితుఁడైనవాఁడు మనస్సుచేతనైననూ వేదమున జెప్పంబడియున్న వైదికాచారములను మనసాకూడ దాట దగదు. అట్లుండక దాటినయెడల నా యాజ్ఞను దాటినందున ప్రియుండైనను నా కప్రియుండే యగును. వేదనిర్మిత మగు మర్యాదయం దపేక్ష లేకున్ననూ వానిని శూలమున నెక్కించెదను. అని యన్వయ వ్యతిరేకములచే స్వస్వ వర్ణోచిత కర్మలను, ఆచారములను అతిక్రమించరాదని స్పష్టముగ దీర్చి చెప్పిన ట్లాయెను. స్వవర్ణ విరుద్ధమగు కార్యమును బ్రాహ్మణేతరులు చేయరాదు. నమ్మాళ్వార్లన్ననో- వారు నిత్య సూరుల యవతారమై, భగవదాజ్ఞా బద్ధులై, యకర్మవశ్యులై యిచ్ఛచే అవతరించువారైనను శరీర మున్నంత వరకును ఆచార్య పరంపరలో నంతర్భవించక అర్చ్యయందు నాధముని కాచార్యులై గురుపరంపరాంతర్భావు లైరి.

వ॥ సం॥ శ్లో॥ వర్తమాన శరీరాదౌ జాతిభేదం చరే ద్బుధః ।
మోక్షే త ద్విష్ణు సాయుజ్యం సర్వేషా మేకమేవ హి ॥

వర్తమానమైన శరీర మున్నంతవరకు జాతిభేదము ననుసరించి వర్తించవలయును. మోక్షమున విష్ణుసాయుజ్యము సర్వులకును ఏకరీతియేగదా! కనుక నమ్మాళ్వార్లు—

వ్యోమ్నః పరస్తా త్స్వవిధం సమేత్య లక్ష్మ్యాని యోగా త్కురుకాధినాథః ।
స మంత్ర రాజ ద్వయ మాహ యస్మై నాథాయ తస్మై మునయో నమోస్తు॥

పరమపదమునుండి వేంచేసి నాధమునులకు తిరుమంత్ర ద్వయాది ప్రబన్ధములను, యోగ రహస్యములను ప్రసాదించి

నట్లు స్పష్టముగ నేర్పడియున్నది. వారు ప్రసాదించిన ప్రబంధమునందును- 'తిరువాయ్ మొజి' యందు (తి॥ ర ప॥) "వేదం కల్లార్ గళై క్కొండు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదం పణిన్దు" అని శ్రీవైష్ణవ బ్రాహ్మణులద్వారా భగవత్సమాశ్రయణ ప్రకారము నుపదేశించిరి. మరియు వేదమునందాచార్యాశ్రయణ క్రమమును జెప్పెడి శ్రుతియందు- "సమిత్పాణి శ్శ్రోత్రియం" అని, "శ్రోత్రియ శ్ఛందోఽధీతే" వేద సంపత్తిగల బ్రాహ్మణుని ఆశ్రయించుమని చెప్పియున్నది. రామ కృష్ణా ద్యవతారములయందు క్షత్రియు లనేకు లస్త్ర గ్రామాదులు తెలిసినవా రుండగ బ్రాహ్మణులవద్దకు వెళ్ళి మంత్ర గ్రామాదులను గ్రహించుటకు కారణమేమి? అర్జునాదులు భీష్ములవద్ద గ్రహించక ద్రోణులవల్ల, కృపాచార్యుల వల్ల గ్రహించుటవల్ల క్షత్రియాదుల కుపదేశాధికారము లేదని స్పష్టమగుచున్నది. రామానుజులవారు తా మేర్పరచిన సింహాసనస్థులలో జాత్యంతరుల నేర్పరుపకపోవుటకు కారణ మేమి? శ్రీభాష్యమున శూద్రువకు బ్రహ్మవిద్యాధికారము లేదని స్పష్టముగ ప్రసాదించియుండుటవలన శాస్త్ర సమ్మతము గాదని యేర్పడుచున్నది. శ్రీవచన భూషణము తమ కనుకూలమని తలంచుట వెర్రితనము.

వర్ణాశ్రమ విపరీతమాన ఉపచారముం, వర్ణాశ్రమ విపరీతారాధన చేయరాదని సాయించియుండుటచే తమ అభిప్రాయమును మార్చుకొనుట మంచిది.

బ్రాహ్మణః క్షత్రియో వైశ్య శ్శూద్ర శ్చ పృథివీపతే,
స్వధర్మతత్పరో నిత్య మారాధయతి నాన్యథా ॥

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు విధి ప్రకారముగ వేదోక్త పురాణోక్త ప్రకారముల నారాధించవలయును. అన్యథా ఆరాధింపరాదని చెప్పియున్నది.

వర్ణాశ్రమేషు యే ధర్మా శ్శాస్త్రోక్తా నృపసత్తమ
తేషు తిష్ఠ న్నరో విష్ణు మారాధయతి నాన్యథా ॥

అనగా వర్ణాశ్రమ ధర్మముల ననుసరించియే విష్ణువును పూజించవలయును. అన్యథా పూజింపరాదని చెప్పియున్నది.

అయితే జాతి విపర్యాసమై ఏకజన్మమున విశ్వామిత్రుడు బ్రాహ్మణుడు కాలేదా యని శంకింపతగదు.

శ్లో॥ ఋచీకే నాహితం బ్రహ్మ పర మేత ద్వ్యధిష్ఠిర ॥
ఋచీకునిచే సంస్కరించి ఉంచబడిన బ్రాహ్మణ్యము, అది చెరునిష్ఠము.

శ్లో॥ విశ్వామిత్రం చాజనయత్ గాధిభార్యా యశస్వినీ
ఋషేః ప్రభావా ద్రాజేన్ద్ర బ్రహ్మర్షిం బ్రహ్మవాదినం ॥

ఆ బ్రాహ్మణ్యము ప్రకాశించకపోవుటకు కారణము క్షాత్రయోని సంబన్ధ రూపమాలిన్యము. అది చిరకాల తపోబలముచే నివర్తించి సానపెట్టిన రత్నమువలె బ్రాహ్మణ్యము ప్రకాశించినదేగాని క్రొత్తగ రాలేదు. ఇది సర్వసామాన్యము కాదు, ఇది చెరునిష్ఠ బ్రాహ్మణ్యము, స్వభావసిద్ధమైన బ్రాహ్మణ్యమేగాని, వేరుగాదు. మరియు,

శ్రీరామ రాజ్యపరిపాలన పద్ధతిని చెప్పునపుడు శ్రీరామాయణమున: శ్లో॥ చాతుర్వర్ణ్యం చ లోకేస్మిన్ స్వే స్వే ధర్మే నియోక్ష్యతి ॥ నాలుగు వర్ణస్థులను వారివారి ధర్మములయందు ప్రవర్తింపజేయ గల్గునట్లు జెప్పియున్నారు.

మరియు భిన్నముగ వర్తించువారిని శిక్షించినట్లును చెప్పి యున్నది - జాతి మారుటయనునది. శ్లో॥ ఏవం జాతి విపర్యాసః ప్రేత్య భావే భవేన్నృణాం॥ భారతే॥ వీరుచేయు పుణ్యపాపానుగుణముగ యీ వర్తమాన శరీరానంతరమున మారునేగాని యీ శరీరమున్నంతవరకు మారదని భారత వచనము. పూర్వమునుండి యెవరును ఆచార్య పరంపరలో జేరియుండలేదు. తిరుప్పాణాళ్వార్లు మొదలగువారు. కొందరు జాత్యంతరులుగ నున్నను వారకర్మవశ్యులు.

శ్లో॥ కిమస్యత్రాభిజాయన్తే యోగిన స్సర్వదేహిషు।
ప్రత్యక్షితాత్మనాథానాం నైషాం చింత్యం కులాదికం॥

ఈశ్వరుని సర్వకాలములయందును ప్రత్యక్షముగ జేసు కొనిన నిత్యసూరు లయోనియందు జనించినను వారి కులాది విచారము విచారించగూడదు. తామరాకున నీటివంటిదగును. ఇట్టి భాగవత జన్మనిరూపణమే (మాతృయోని పరీక్షయో డొక్కం) అని ప్రసాదించియున్నారు. మరియు నిత్య సూర్యవతారమైనను తిరుమళిశైయాళ్వార్లు వేదమును వాచా ఉచ్చరించక, నల్లధాన్యమును నఖముతో విరిచి చూపించి నట్లు గనుపించుచున్నది. కనుక నెట్టి జ్ఞానులైనను వర్ణవ్యవ స్థను విడనాడగూడదని సిద్ధాన్తము. ఇతరజాతులకు నైచ్యము జన్మసిద్ధమని ప్రసాదించియున్నది వాస్తవమేగాని, యిందు నకు విపరీతముగ ననుష్ఠించినచో విపరీతఫలమును పొందుట సిద్ధముగదా? మేము జ్ఞానుల మని సమాశ్రయణాదులు చేయుటవలన నైచ్యము నశించి అహంకారము గర్భితమగు టచే నాత్మనాశమేగదా యేర్పడును. ఏ హేతువుచే జాత్యం తరమున కాధిక్యము ప్రతిపాదించబడినదో యీ హేతువు

లేనిచో బ్రాహ్మణాపేక్షయా ఆధిక్య మెట్లు గలుగును ? పూర్వాచార్యానుష్ఠానములను మనము విచారింప శక్యము గాదు. వారి జన్మనిరూపణను జేయుటకు మన మనర్హులము.

బ్రహ్మాండ పురాణే ॥

అనుకంపయితుం దేవః కలికాలే విశేషతః
ఉజ్జీవయితు మారబ్ధః సూరీణా మవతారణాత్ ॥
ద్రావిడేషు విశేషేణ ప్రభవిష్యన్తి సూరయః ।
ఐశ్వర్యస్య స్వయంసిద్ధాః భగవద్జ్ఞానివైభవాత్ ।
అయోనిజా యోనిజాశ్చ దేవాజ్ఞాః పరిపాలకా
ప్రబుద్ధాః ప్రాకృతజనాన్ ప్రబోధయితు ముద్యతాః

శ్లో॥ శరీరా దపి నైస్పృహ్యం భగవచ్ఛరణార్థినాం
ధర్మార్థై రనుపాయత్వం ప్రథయిష్య న్త్యరుప్రథాః ॥

ఇత్యాది ప్రమాణములచే కలికాలమునం దజ్ఞానులను ఉజ్జీవింపజేయుటకై ఈశ్వరుడు నిత్యసూరులను యోనిజులుగను అయోనిజులుగను అవతరింపజేసి, ధర్మార్థములయం దనుపాయత్వమును, శరీరమునందు నైస్పృహ్యమును బోధించెదరనియును, వారును ద్రావిడదేశమున విశేషముగ అవతరించెదరనియును జెప్పుటవలన, వీరి జన్మకు కారణము కర్మ కానేరదు. కేవల భగవదిచ్ఛయే. వారిని శాస్త్రములు బంధించనేరవు.

శ్లో॥ 'త్వదీయ గంభీరమనోఽనుసారిణః' అనగా వారి ననుసరించి సమన్వయ పరచుకొనవలయును. వా రవతరించిన మాత్రమున, శ్లో॥ విష్ణో ర్వరాహ రూపిత్వే విఘ్నభుజాం కి

మిహాగతం ॥ అని విష్ణువు వరాహరూపియై యవతరించిన మాత్రమున, విష్వ్బజముల కాధిక్య మేమివచ్చినది? అయితే,

శ్లో॥ చండాల మపి వృత్తస్థం తం దేవా బ్రాహ్మణా విదుః ॥

అని యున్నందున, బ్రాహ్మణ్యము ద్వివిధము - జాతినిష్ఠమై షోడశ సంస్కారములతో గూడి యోనిజమైన బ్రాహ్మణ్యమొకటి - వృత్తస్థ బ్రాహ్మణ్య మొకటి - అనగ

శ్లో॥ పంచాస్త్రజ్ఞాః పంచసంస్కారయుక్తాః పంచార్థ
జ్ఞాః పంచమోపాయనిష్ఠాః తే వర్ణానాం పంచ
మా శ్చా శ్రమాణాం విష్ణో ర్భక్తాః పంచకాల ప్రపన్నాః ॥

పంచాయుధజ్ఞులై, పంచ సంస్కార యుక్తులై, పంచార్థజ్ఞులై, పంచమోపాయ నిష్ఠులై, పంచకాల ప్రపన్నులై, విష్ణుభక్తులై యుండు మహానుభావులు పంచమ వర్ణస్థులుగాను, పంచమాశ్రములుగాను కాగలరు. వృత్తస్థు లనగ సత్స్వభావులు. అనగా శాస్త్ర నిషేధాదులయందు దప్రవృత్తి-తన కేర్పడియున్న ధర్మములయందు జాగరూకత గలిగి వర్తించుట-ఇట్లుండు వర్ణాంతర వ్యక్తులు మిక్కిలి గౌరవనీయులే. తత్సజాతీయాపేక్షయా, ఇంతమాత్రముచే బ్రాహ్మణ సవ్యవహార్యతను బోధించనేరదు. ఇట్లుండగ-

కొందరు అర్థాతురులై ప్రపన్నుల కేనియమమును లేదని, స్త్రీ, శూద్రులచే గీతోపనిషత్తు మొదలగువాని నధ్యయనము జేయించుట మొదలగునవి చేయుచున్నారు. ఇది పూర్వోక్త వచనములచే నిరసించబడియే యున్నందున నిచ్చట విస్తరించ లేదు.

శ్లో॥ అధ్యాపయన్తి వై వేదాన్ శూద్రాన్ శూద్రోపజీవినః ।
సేవన్తే బ్రాహ్మణా స్తాం స్తు స్తువంతి స్తుతిభిః కలౌ ॥

అనగా యీ కలిలో బ్రాహ్మణులు శూద్రాదుల కధ్యయనాదులు జెప్పి వారిని విశేషముగ స్తుతించి జీవించెద రనియును,

అధీయంతే తథా వేదాన్ శూద్రా ధర్మార్థకోవిదాః
యజన్తే చాశ్వమేధేన రాజాన శ్శూద్రయోనయః ॥
తస్మా దాయు ర్బలం రూపం కలిం ప్రాప్య ప్రహీయతే ॥

అనగా, శూద్రులు ధర్మార్థకోవిదులై కలియందుదధ్యయనమును జేయుదురనియును, అశ్వమేధాది యాగములను జేయుదురనియును, ఇందువలన ఆయుస్సు, రూపము, బలము, కలియందు క్షీణించుననియును జెప్పియున్నది.

అన్నానాం నియమో నాస్తి యోనీనాం చ విశేషతః
ఆశ్రమాణాం జనానాం చ సర్వే మ్లేచ్ఛాః కలౌయుగే ॥

అన్నాది నియమములను, యోని నియమములును, ఈ కలియందుండవనియును,

రాక్షసాః కలి మాశ్రిత్య జాయన్తే బ్రహ్మయోనిషు
బ్రాహ్మణా నేవ బాధన్తే తత్రాపి శ్రోత్రియాన్ కృశాన్ ॥

కలియందు రాక్షసులు బ్రాహ్మణులుగ జనించి కృశించియుండు బ్రాహ్మణులను, మిక్కిలి శ్రోత్రియులను బాధించెదరనియును జెప్పియున్నది.

శ్లో॥ ఇహ సన్తో విషీదన్తి ప్రహృష్యన్తి హ్యసాధవః
కలినాఽధర్మమిత్రేణ ధరేయం బాధితాధునా
తాడయన్తి ద్విజేన్ద్రాంశ్చ శూద్రా వై స్వల్పబుద్ధయః

సత్పురుషులు మిక్కిలి దుఃఖించెదరు. దుష్టులు మిక్కిలి సంతోషించెదరు. ఈ ప్రకారముగ అధర్మమునకు స్నేహితుడైన కలిపురుషునిచే యిప్పుడు భూమి బాధించ

బడును. సత్పురుషులగు బ్రాహ్మణశ్రేష్ఠులను అల్పబుద్ధు లైన శూద్రులు కొట్టెదగనియును,

శ్లో॥ ఆశ్రమా యవనై రుద్ధా స్తీర్థాని సరిత స్తథా
దేవతాయతనా న్యత్ర దుష్టై ర్నష్టాని భూరిశః
అత్యుగ్రభూరికర్మాణో నాస్తికా రౌరవా జనాః ॥

ఆశ్రమములన్ని యవనులచే సరికట్టబడును. తీర్థము లును, సరిత్తులును, దేవాలయములును దుష్టులచే చెడిపోవును. జను లత్యంతమును ఉగ్రమగు కర్మలు కలిగి, నాస్తికు లై పాపిష్ఠు లగుదురు. రాజులను పేరుపెట్టుకొనినవా రందరు పన్నుల వ్యాజ్యముచే ద్రవ్యము నపహరించెదరేగాని జనులను రక్షించరని 'హర్తారో న తు గోప్తార శ్శుల్కవ్యాజేన పార్థివాః॥' అనుటచే దెలియుచున్నది కనుక నిట్లు ఋషులు పురాణములయందు కలి నిట్లు వర్ణించి యున్నారు. అన్ని యును అట్లు జరుగుచుండుటచే ఋషి వాక్యము లబద్ధ మని చెప్పసాధ్యపడదు. పార్థివ శబ్దమునకు పరిపాలకులని యర్థము. ఇట్లు స్వల్పముగ వ్రాయబడినది. విస్తరముగ ధర్మప్రదీప మను కాశీలో అచ్చువేయుబడిన గ్రంథములోను, మత్కృత వర్ణాశ్రమ ధర్మప్రదీపమను గ్రంథమునందును చాలా విస్తృత ముగ వ్రాయబడియున్నది; అచ్చువేయుబడును కొలది రోజు లలో, గనుక విరమించినాము.

మరియు పేరుల పుస్తకములను తీసుకొని వచ్చినంత మాత్రముననే ఆ యాచార్యులను నాశ్రయించ తగదు. వంశ్యులై యాచార్య నియమమును పొందినవారినే యాశ్ర యించవలయును.

శ్లో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహం
ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివామ్భో
లోకస్తథా ప్యహిత మాచర తీతి చిత్రం ॥

అనగా ప్రతి వ్యక్తికిని వార్ధక్యము వ్యాఘ్రమువలె ఇదుగో వచ్చుచున్నానని బెదిరించుచూ సమీపించుచున్నది. రోగములు లాటీలు తీసుకొని కొట్టెడి శత్రువులవలె బాధించుచున్నవి, ఆయుస్సు చిల్లికుండయందున్న యుదకము వలె క్రమక్రమముగ క్షీణించుచున్నది. ఇట్లు చూచుచును, అనుభవించుచును అశాస్త్రీయకృత్యప్రవర్తనారూపాహితమునందే తాము ప్రవర్తించి యితరులను ప్రవర్తింపజేసి యధోగతిని పొందించుచూ పొందుచూ నుండుట యేమి చిత్రమని ప్రసాదించియున్నారు.

శ్లో॥ 'ఆచార్యస్తు హరి స్సాక్షాత్' అనెడి శాస్త్రమార్గతాచార్యులను శ్లో॥ 'గురుం ప్రకాశయే ద్ధీమాన్'॥ అని ప్రకాశింపజేయకపోవుటయేగాక వారి గౌరవాదులను సహించక, అనేక జన్మార్జిత పాపవాసనావాసితకర్మప్రేరితులై యపకారములనే చేయుచూ గురుద్రవ్యాపహారులై యుండువారికి కలిగెడు దుఃఖ పరంపరాదులకు చింతించి యీ గ్రంథమును చూచియైనను తెలుసుకొని పాపభీతులై యకృత్యకరణ కృత్యాకరణముల వలన పశ్చాత్తప్తులై సన్మార్గరతులై భగవత్కటాక్షముచే నుజ్జీవింపవచ్చు ననే యభిప్రాయముచే నీ గ్రంథము వ్రాయబడెను.

పూర్వాచార్యులలో నొకరిశిష్యులకు మరియొకరు సమాశ్రయణమును చేసినట్లును కొంతకాలమునకు పూర్వా

చార్యులు వేంచేసినట్లును- సమాశ్రయణమును చేసినవారు- తెలియక సమాశ్రయణమును చేసినామని విచారించినట్లును గ్రంథములయందు కానబడుచున్నది.

శ్లో॥ మదీయ సందర్భగర్హాభ్యసూయా
స్తిష్ఠంతి యేతాన్ ప్రతినైషయత్నః
దివాన్ధడింభా దిననాథబింబం
పరం నపశ్యన్తు పరాభవః కః ॥

బిందు దుర్లిపి విసర్గవీధికా
పఙ్క్తిభేద పదశృంగ భూషణం
హ_స్తవేగజ మబుద్ధిపూర్వకం
క్షన్తు మర్హథ సమీక్ష్య సజ్జనాః ॥

పరధన పరదార ప్రస్మృతాశేషకృత్యా
నిజగుణకలికాభి ర్లోక మామోదయన్తః
అవిదిత పరదోషా జ్ఞానపీయూషపూర్ణాః
కరకృత మపరాధం క్షన్తు మర్హంతి సంతః ॥

శ్రీమన్నాథకులతిలక శ్రీమద్రంగార్యలబ్ధ జన్మయుగళేన
శ్రీమత్కవివల్లభ భాష్యకారార్యానుజేన వేంకట
తాతదాసేన కృతాచార్యాన్తరాశ్రయణాది
దుర్ణయ నిర్మూలనాఖ్య గ్రన్థః
స మా ప్తః ॥



# శ్రీ గోదా గ్రంథమాల

## సభ్యత్వ వివరణ:

1. గ్రంథ ముద్రాపకులు:

గ్రంథవ్యయము సర్వము భరించువారు

2. శాశ్వత పోషకులు:

ఒకేసారి రు 116-0-0 విరాళము నిచ్చువారు

3. పోషకులు:

ప్రతి వత్సరము రు 25-0-0 ఇచ్చువారు

4. సభ్యులు:

ప్రతి వత్సరము రు 10-0-0 ఇచ్చువారు

5. అభిమానులు:

ప్రతి వత్సరము రు 5-0-0 ఇచ్చువారు

సూచన:—దాతలపేర్లు కృతజ్ఞతా పూర్వకముగ గ్రంథమున ముద్రింపబడును.

శ్రీ గోదా గ్రంథమాల ప్రథమ పుష్పము: 'అంజలి'
ప్రతులు లేవు.

ద్వితీయ పుష్పము : 'త్రివేణి' 2-0-0

1 శఠకోప చరిత్ర శ్రీ న. చ. కృష్ణమాచార్యులు

2 పరాంకుశ శతకము శ్రీ తి. న. చ. నంజ తిరువేంకటాచార్యులు

3 శఠకోప గీతామృతము శ్రీ డాక్టరు న. చ. రాఘవాచార్యులు

తృతీయ పుష్పము : భ్రమర గీతలు 1-00

మూలము : సూరదాసు.

అనువాదము : శ్రీ "మధురకవి"

మైలవరపు సూర్యనారాయణమూర్తి.

బాలవాఙ్మయము - ప్రథమరత్నము

మీరాబాయి : (చరిత్ర) వెల 50 నయాపైసలు

కర్త: హిందీ విద్వాన్ శ్రీ మిక్కిలినేని సుబ్బారావు

రాబోవు గ్రంథములు :

1 నారాయణ శతకము "సంగీత సాహిత్య కళానిధి" శ్రీ నల్లాన్
చక్రవర్తుల కృష్ణమాచార్యులు

2 శ్రీ రామానుజ చరిత్ర శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు
సాహిత్యరత్న, భాషాప్రవీణ,

ప్రతులకు : కాండూరి లక్ష్మీనరసమ్మ

వ్యవస్థాపకురాలు: శ్రీగోదాగ్రంథమాల

శ్రీమన్నారాయణ పురము,

ఉల్లిపాలెం పోస్టు, దివితాలూకా, కృష్ణా జిల్లా.